ప్రణవమఠగ్రంథమాల:—

ఓమ్

# భారతవర్ష పునర్నిర్మాణము.

**Translation of**

# Re-organization of India.

(3 వ ప్రచురణము.)

1933



స్వామి వేదానంద.

భారత సేవాశ్రమ సంఘము.

 [వెల 0—4—0.

ప్రణవమఠగ్రంథమాల:—

ఓమ్.

# భారతవర్షపునర్నిర్మాణము.

Translation of

## Re-organization of India.

(3 వ ప్రచురణము.)

1933




స్వామి వేదానంద.

భారత సేవాశ్రమ సంఘము.

 [వెల 0-4-0.



జగద్గురు ఆచార్య శ్రీమత్ స్వామి ప్రణవానంద.

# ప్రస్తావన.

—:o:—

ఈచిన్నిపొత్తమును ప్రచురించుటలో, వేదాంతచర్చలును, అనర్థములగు సూహాసమూహములును, ధీమంతుఁడగువాని అంతుపంతులేని ఆలోచనలను, ఆవిష్కరింపవలెనని మాయుద్దేశ్య మేమాత్రమును గాదు. అట్టివాని కిది చాల దూరము.

తత్వమన నేదో, బ్రహ్మజ్ఞానోదయమన నేదో, పరమాత్మ నెఱుఁగు టెట్లో, వివరించుటకును, భారతసేవాశ్రమసంఘముయొక్క నిర్మాతయు, నిర్ణేతయు నగు నొక పరమపురుషుని పరిదర్శించుటకును ఈపుస్తక ముద్దేశింపఁబడినది.

ఈపరమపురుషుఁడు — ఈరక్షకుఁడు — ఈప్రభువు — తన దివ్యాదేశమును మానవకోటికంతటి కొసఁగియున్నాఁడు. ఆతని విశ్వలోకముఖ్యనాయకత్వము క్రిందనే, భారతవర్షముయొక్కయు, విశ్వమానవకోటియొక్కయు విమోచనమును సాధించుటకై ఈసంఘము స్థాపింపఁబడినది.

విశ్వమానవతత్వమగు ("సనాతనధర్మము") అనాద్యంతమగు సనా[illegible] నాగరకతను, పునఃప్రతిష్ఠించుటకును, [illegible] పవిత్రము [illegible] సంస్కరించుటకును, [illegible] ప్రయత్నమునవి పూనికొనినది.

[illegible] మనవ్యాదముములందు [illegible] త్సాహము [illegible] పుట్టింపవచ్చును. కాని పరమేశ్వరుని

సందేశమీ దేశికోత్తమునిద్వారా ఇటు లావిష్కరింపబడినది. "ఈసంఘము చేనిర్దింపఁబడుమార్గముననే భారతవర్షమువిముక్తి నొందఁ గలదు."

ఈ సంఘముయొక్క సందేశమును గుఱించియు, దాని కార్యక్రమము పద్ధతిని గుఱించియు కొన్నివిషయము లీపుస్తకమున వివరింపఁబడినవి.

ఈసంఘముయొక్క కార్యక్రమము, స్వానుభవలక్ష్యమాత్రిమై అశాస్త్రీయముగాక, శ్రుతిపరికాశకమై, వేదోక్తమగుమార్గమునే అవలంబించుచున్నది—అనగా కలకాలమునా దేశభగవంతుఁ డేదివ్యసందేశము నొసంగి యున్నాఁడో దానినే, నేఁడు, ప్రజలచే నాచరింపఁ జేసి, వారి నుద్ధరించుట కీ సంఘము పూనుకొన్నది. కావున ఈ పుస్తకములో సిద్ధాంతములు, లక్ష్యములే తప్ప, వివాదములు, వితర్కములు చెప్పఁబడవు. అంతమాత్రమున నిది నిర్వివాదనీయమును, నిర్వితర్కనీయమును అగు స్వచ్ఛందపద్ధతి ననుసరించుచున్నదని ఎంతమాత్రము నర్థముగాదు. కాని అన్ని వివాదములకు అన్ని వితర్కములకు అవధియును, ఆధ్యాత్మిక దృష్టికే గోచరించునట్టిదియు, మానవమానసవికారముల కందనిదియు నగు, పరతత్వమను గట్టి పునాదిపైననే యీసంఘముయొక్క పద్ధతు లాధారపడియున్నవి.

ఓమ్.

ఓమ్

# పునర్నిర్మాణము.

పునరుత్పత్తియు, పునరుద్ధారణమును, నేఁడు జాతికి ముఖ్యావసరములైయున్నవి. కాని నేఁడు భారతవర్ష పునర్నిర్మాణమున కవసరములైనవి అనవద్యోత్సాహము, అనర్గళవిశ్వాసము, అప్రతిహతధైర్యము, అప్రమాదికసామర్థ్యము, అనవరతకార్యశీలత. కావున విజయాభిషేకము జరుగవలెనన్న, జాతి, తన శక్తిసర్వస్వమును, నలుమూలలనుండి కూడఁదీసికొని వినియోగింపవలసియున్నది.

సిద్ధాంతములకు మన కేకొఱఁతయు లేదు; గ్రంథములకు, వ్యాఖ్యానములకు, ఉపన్యాసములకు, చర్చలకు, కొదువ ఏబదేండ్లనుండియును లేదు. ఐనను మన పలుకులగాలిమెఱుఁగుకన్న చేతలకూరిచిన్నమే మేలుగదా! ప్రస్తుతకాలమున కావలసినది పసిగాని ఘోషగాదు. అవిరళకర్మశౌర్యము మనుదినజీవితసరణియం దెంతవఱకనుష్ఠింపఁబడునదియే అధునాతనవిచారణీయాంశము; ఎంతవఱకు ప్రదర్శింపఁబడునదికూడ అధునాతనాభినివేశము. ఫలితార్థమేమన:—

(1) ప్రప్రథమమున జ్ఞానధనుఁడగు నొక త్రివేదిని, (స్వామిని,) చేఁబట్టి, తదీయదివ్యప్రసాదాధీనులమై, ఆతని

ఆర్షపాదములసన్నిధిని హిందువుల ఆదర్శధర్మము లెఱుంగఁ దొడఁగవలెను.

(2) పిమ్మట వందలు వేలుగా, వారికాత్మారాధనము సలుపుచు, తదాదర్శధర్మములను మన మొక్కొ-రిజీవితములం దనుష్ఠింపవలెను.

(3) పిదప తదాదర్శధర్మములను సంఘములో నెల కొల్పుటకుఁ బూనుకొనవలెను.

(4) మనమందర మీయాశయములకు బలమొసంగు టకై ఆవిజ్ఞానమూర్తిచుట్టు నొకసంసర్గముగా జేరి- మన కెల్లర కాతఁడొకఁడే దేహము, ఒకఁడే చిత్తము, ఒకఁడే యాత్మ, ఒకఁడేమూర్తి, తుదకొక్కఁడే ప్రత్యక్షావధి, తదంతర్గతాదర్శ గుణమూర్తి యాతఁడొక్కఁడే యని భావించుచుండవలెను.

ఆదర్శగుణములను యథాపూర్వముచేయుట పైనొక వంకను, ఇంకొకవంక బహుధాభ్రష్టమైన శక్త్యుత్సాహముల పునరుద్ధరించుటపైనను, హిందూదేశవిమోచన మాధారపడి యున్నది.

క్రమనిర్మాణము లేనిదే ఏమహాకార్యమునుగాని సాధిం చుటకు వలనుపడదు. మన మొకసారి ప్రాచీనప్రపంచచరిత్ర మును పరిశోధించితి మేని పురాతనప్రపంచజాతులన్నియు యీ క్రమనిర్మాణమూలముననే ఆశ్చర్యకరమగు కృతార్థతాయశో

విభవముల సాధింపఁగలుగుట కానవగును. బౌద్ధమతము లోకమున నుప్పాతికపాలాక్రమించుట కేది తోడ్పడినది? ప్రపంచములో నర్ధభాగము నాక్రమించుటకు మహమ్మదీయ మతమున కేది సాయమైనది? క్రైస్తవమతము లోకమంతటను వ్యాపించుట కేది సహాయపడినది? వీటికన్నిటికిని అజయ్యమగుక్రమనిర్మాణబలమే మూలకారణము. పాశ్చాత్యదేశములనుండి మన మీ క్రమనిర్మాణార్థమును గ్రహించిన గ్రహింతుముగాక; దానిని మనధర్మములు, మన పద్ధతులపైననే నడపింపవచ్చును.

వ్యక్తికి వ్యక్తిగాఁ దీసికొని పోల్చినపక్షమున, మనము ప్రపంచములో పురోగమించు నేదేశవాసులకుగాని తీసిపోము; పైపెచ్చు, అనేకవిషయములలో అతిక్రమింపఁగలము కూడను.

కాని మనకు కావలసినదేమన కలసికొలుకట్టుబాటు— అనగా, బలసమీకరణము, అభిప్రాయసంయోజనము శక్తిసంయమనము ఈనిర్మాణకార్యోత్సాహము నిద్రాణములైన మనయీయాత్మలనుపునశ్చేతన్యాన్వితములుగాఁ జేయువఱకు దేశమాతావిమోచనకార్యము ఒక్క అంగుళమేని ముందుకు జరుగదు; జరుగలేదు. ఈక్రమనిర్మాణకార్యసాధనమార్గమున మనప్రత్యయసంకేత మిదియే— ఏదన— వ్యక్తిగతప్రయోజనములు, సాంఘికప్రయోజనావేదికపై సమర్పింపుఁడు;

దేశీయ, జాతీయప్రయోజనమునకై, సాంఘిక, ప్రజాప్రయో జనముల నాహుతిచేయుడు. మనయనుదినజీవితము అన్య సేవా త్మార్పణాత్మత్యాగాత్మ నిగ్రహాప్రవృత్తిప్రదర్శనములచే పూర్ణమై యుండవలయును. కనుక మానవులమనస్సులలోని ఉన్నతాశయములే, సత్యమగు క్రమనిర్మాణోత్సాహమునకు దారిజూపును. ఈవిషయముననే, హిందూ పాశ్చాత్యనిర్మాణ ములకు తారతమ్యము కనుబడఁగలదు. ఇది మఱువకుందుము గాక.

ఓమ్.

ఓ మ్.

# పునః ప్రతిష్ఠ.



ప్రపంచకము క్షణభంగురము. ఎల్లప్పుడు నొకేమా దిరి పరిస్థితులుండుట అసంభవము. అనవరతము, అభివృద్ధిలో, క్షీణదశలో ఈభౌతికసృష్టి పరిక్రమించుచు నేయున్నది. ఇది భౌతికనిర్ణయము. కాన వ్యక్తిజీవనముగాని, సాంఘికజీవనము గాని, జాతీయజీవనముగాని, ఈ భౌతికనిర్ణయమువలన మా ర్పులు తప్పించుకొనలేవు.

కావున ఈ ప్రవృద్ధిప్రపాతములమధ్యమున, వ ర్ధన ప్రతివర్ధనముల అంతరమునం, దిరుగుచున్న ఏజాతి యెప్పి, ఏదో అననేల? ప్రతిజాతియు స్వీయజీవితకాలచక్రభ్రమణ మున నొక్కసారి యున్నతినొంది, స్వకీయ వ్యాపారనాగరికతా విశేషములచే ననేకవిధములుగా కీర్తనీయమై, ప్రపంచమున కెల్ల నాభరణాయమానమై, సర్వదేశసంసేవ గొనుచు, శ్లాఘా పాత్రమైయుండును; కాని కాలక్రమమున దాని యుచ్చదశ పోయి, దానిమహాన్నత్యము మసిపాలుగాక తీరదు. ప్రపంచ పరిణామమున నేలపాలైనప్రతిజాతిచరిత్రయు నీ యంశము నే విస్ఫురింపజేయుచున్నది. ఐగుప్తీయులు, బాబిలనీయులు, ఫొ యనీషియనులు, పారశీకులు, గ్రీకులు, రోమకులు, వీరిజా

తులు భౌతికనాట్యరంగమున, నటించి, కాలగతిని తెరచాటైరి. ఈజాతులు కతిపయశతాబ్దములుమాత్రమే భూమిపై వర్ధిల్లి, మరల నెన్నటికి మేల్కొనని పెద్దనిద్దురం జెందినవి. వానివాని పూర్వగాథాసహస్రములు నేడు పుక్కిటిపురాణములు, పిట్టకథలలో నంతర్లీనములైనవి.

కాని ఉన్న విచిత్రమంతయు హిందూదేశమునుగుఱించియే! భూముఖమున నవతరించినజాతులకెల్ల హిందూజాతియే పురాతనమైనదని చెప్పుటలో నతిశయోక్తి ఏమాత్రమును లేదు. కాని కఠినమగు పరీక్షలకుం జిక్కి, సంఘట్టనముల పాలై, నూత్నయుగముల పరిభ్రమణములకు సంఘర్షణములకోర్చి అప్రతిహతమగు చైతన్యశక్తితో జాతీయతను నిలుపుకొన్న జాతి హిందూజాతియొక్కటే; నిలుపుకొన్న దేశము హిందూదేశమొక్కటె! ఎయ్యది మన జాతికట్టి చైతన్యప్రభావము నిచ్చినదో ముందుముందు చర్చింపంబడును.

ఇతరజాతు లన్నియు చచ్చి ధ్వంసమై పోయిననూ, ఎంతటి క్షీణదశయందైనను, నిరాశాజనకస్థితియందైనను, ప్రాణములతోనున్నది హిందూజాతియొక్కటే. శతాధిక శతాబ్దపర్యంతమగు హిందూజాతి తన జీవితచర్యలో తెంపులేని కష్టప్రయాసములకోహటించి, పెనగులాడవలసివచ్చినది. తన్మూలమున దేశీయాభివృద్ధి కాటంకము గల్పించునొకమాంద్యము, జాడ్యము ప్రజల నావహించెడిది. దేశీయవ్యుత్పత్తి

స్తబ్ధభావము వహించి, సర్వము నాశనమునకు దారిచూపె డిది. తుదకు పరాత్పరుడే లోక మధర్మమయము గాకుండు నట్లు, శ్రీకృష్ణుఁడు, బుద్ధుఁడు మున్నగు మహామహులవలె లోకమున నవతరించి, భూరిధర్మప్రవర్తయితయై, పునరుజ్జీవనకారకమును త్రిభువనోల్లాసకరమునగు స్వీయబోధామృతములచే ప్రజాహృదయముల నింపి వారికి పర్యుత్సాహముకలిగించువాఁడు. ఈ నూతనచైతన్యోద్వేగము ప్రజలను మరల కొన్ని శతాబ్దములవరకు నడపించి, అది తఱిగిపోగానే మఱల ప్రజల నుద్వేజితులచేయుటకై అమానుషశక్తి వేఱొకటి వలయుటయు వేఱొక యుగపురుషుఁడు కాలోచితముగా నుత్పన్నమగుచుండును. ఈ విధముగా హిందూదేశము మాటిమాటికి క్రిందఁబడుచు, కాని తిరుగఁ గ్రొత్తయైన యుత్సాహముతో మరలమరల ఆధ్యాత్మికోజ్జ్వలములగు నిట్టి విజ్ఞుల బోధలచే తలనెత్తుచున్నది. ఇట్టి పునస్సంస్థాపనయుగములు, కురుక్షేత్ర సంగ్రామానంతరము, గౌతమబుద్ధుని కాలమునను శంకరుడు, రామానుజుఁడు, శ్రీచైతన్యప్రభుఁడు మున్నగు వారి కాలములందును గుర్తింపఁబడుచున్నవి.

కనుక అధఃపాతాళమునకు దేశ మెప్పుడు పయిన దిగఁబడిపోవుచున్నదో, ఎప్పుడు జాతి సమోదయమునకు, స్వేచ్ఛకై తటతట కొట్టుకొనుచున్నదో, అప్పుడు, ఆధ్యాత్మిక

పురుషసింహము లవతరించి, దేశమును, జాతిని, సంఘమును, సనాతనధర్మనియమములపై ప్రతిష్ఠింతురని తెలిసికొంటిమి.

అట్టిక్షీణదశయే ఇప్పుడు జాతిని గొంతునులిమి చంప నున్నది. మనమందరము, ఎవరేని ఒకపుణ్యాత్ముఁడు నడుమువిఱిగి కూలబడినయీజాతిని, మరల శక్త్యుత్సాహములు గొలుపునాయని యాశించుచున్నాము. ధర్మసంస్థాపనము జరిగినదా, సరియే, లేనిచో జాతి నిశ్శేషముగా దుర్గతిపాలగును. హిందూదేశము అదృష్టఫలమో, అట్టిననేల, విశ్వమానవకోటియదృష్టమువలననో చిరవాంఛితమైన ఆరక్షకుఁడు రానేవచ్చినాఁడు; ధర్మసంస్థాపన ఆరంభమయ్యేయున్నది. కావున, భారతసామ్రాజ్యసంతానమున, ప్రతిప్రియపుత్రుఁడును, తనపైనుండు నుత్తరవాదమును గ్రహించి, కార్యరంగమున కుఱికి, ఈధర్మసంస్థాపనామహాకార్యమునకు, తన యథాశక్తి తాఁ గావించి, విశ్వమానవకల్యాణమునకు తోడ్పడునుగాక.

---

# రక్షకుఁడు.

"పరిత్రాణాయ సాధూనామ్, వినాశాయచ దుష్కృతామ్,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే !"

పరమేశ్వరుని ఈదివ్యవాక్యము అనేకశతాబ్దముల నుండి భారతీయజీవనమున నిరూపింపఁబడిన యంశమే ! భవిష్యత్తునను నిరూపింపఁబడ నున్నదికూడను.

భారతదేశము, తన ఈసందిగ్ధావస్థయందు—మరింత క్షీణదశయందు, గాఢతరాశాభంగములందును—ఒక దివ్యపూరుషుని, ఒక యోగిని, ఒక మానవాతీతుని, తన కధిష్ఠాతగా, ఇవ్వఁబడఁగలిగినది. ఈమహానుభావుఁడు, బాల్యమునుండియు, మనస్సంధానమునకు, విషయపర్యాలోచనమునకు, సర్వస్వ మర్పించినాఁడు. ఈపర్యాలోచనవలన నాతఁడు, ఉత్తమోత్తమమగు తత్వమును గ్రహించుటకు అజ్ఞానభూయిష్ఠమును, శోకవ్యాధి మరణదుఃఖావృతమైన ఈప్రపంచమున మానవకోటిని దుఃఖమోచనులఁ జేయుటకును, ఉద్దేశించినాఁడు. ఈవిషయమున నీతడు గౌతమబుద్ధుని తన కాదర్శముగా నుంచుకొనినాఁడు.

గౌతమునివలె నితఁడుగూడ నిహలోకసౌఖ్యముల నేవగించి, మానవుల కష్టమునుగూర్చియు వానినుండి వారి

నుద్ధరించుమార్గమునుగూర్చియు, తీవ్రముగా నాలోచించు చుండెను. బాల్యమునుండి యితఁడు కళంకరహితమై, పవిత్రమై, ఆత్మనిగ్రహముతోకూడిన జీవనముఁ గడపినాఁడు. ఆదర్శరూపకమైన నైష్ఠికబ్రహ్మచర్యము నితఁడు తనజీవితము న నవలంబించెను. మనోవాక్కాయముల పావిత్ర్యము, ఆత్మేంద్రియనిగ్రహములందు నిరవగ్రహసాధన ఇతని జీవితమునకు ముఖ్యాదర్శములు. అందుననే తనసంకల్పమునుండి యీతఁడించుకయు చలింపలేదు. తత్కారణమున, అసదృశమగు నైతికాధ్యాత్మికభౌతికమానసికశక్తులు బాల్యమునుండి ఈతనియందుఁ జూపట్టుచుండెను.

ఈవిధముగా నీమహామహుఁడు శక్తినధికముగా సేకరించుచు, అధ్యాత్మికజ్ఞానమునందు, ఉత్తమోన్నతస్థానము బడయువఱకు, తత్ప్రగమాణమార్గమున శీఘ్రముగ నభివృద్ధికి వచ్చుచుండెను. నిర్మలమగు నాతని మానసికదృష్టిపథమున, భారతదేశదుర్గతినిగూర్చియు, మానవజాత్యుద్ధరణమునుగూర్చియు, జ్ఞానోదయమయ్యెను. ఆక్షణమునుండీ, యీమానవాతీతుఁడు, వేదార్థములను, బౌద్ధమతమునందలి అహింసా మును, మిశ్రీకరించిన పద్ధతిపై భారతదేశమును పునరుద్ధరించి పునఃప్రతిష్ఠింప నిశ్చయించుకొనెను. ఈనిశ్చయము దైవప్రేరితముగా, అనుల్లంఘనీయముగా నాతఁడెంచెను.

ఆ దినమునుండియు, నీమహాత్ముఁడు తాను గ్రహించినతత్వము లోకమునకు బోధించి, భారతదేశము నలుప్రక్కలకు తన యాహ్వానము పంపఁ బూనుకొనెను. మహాబౌద్ధమతప్రచారకసంఘముఁబోలె, "భారతసేవాశ్రమసంఘము" ఇతనిచే స్థాపింపఁబడెను. భారతదేశపు టుత్తమోత్తమాదర్శములు, మనవ్యక్తులయందును, మనసాంఘికజీవనమునందును పునఃప్రతిష్ఠింప, ఆధ్యాత్మిక, సారస్వత, పారిశ్రామిక, జాతీయోద్ధరణసంస్థలనేకములు స్థాపింపఁబడెను. క్రమముగా వాని నినుమడింపఁ బ్రయత్నములు జరుగుచున్నవి. సర్వసంగపరిత్యాగము, ఆత్మేంద్రియనిగ్రహములు, మానవసేవ మొదలైన భారతదేశాదర్శములపై జాతీయ పునరుద్ధరణమే యీసంఘపు ముఖ్యోద్దేశము.

ఈ యుదారపురుషుఁడు కొంతమంది యువకులను, చేరదీసి వారిని తా నవలంబించిన మార్గమున సుశిక్షితుల నొనరించుచు, సర్వసంగపరిత్యాగము, మానవసేవ, వారికి ప్రథమముగఁ జెప్పి, వారిద్వారా సజీవములగు నుదాహరణములచే దేహపారిశుద్ధ్యముయొక్కయు, మనఃపావిత్ర్యముయొక్కయు, ఆత్మవ్యుత్పత్తియొక్కయు, ఆత్మనిగ్రహముయొక్కయు, మేలిగుణముల నుపదేశించుచు, తన్మూలమున నైతికాధ్యాత్మికపరిసరమున, సాంఘికజాతీయవికాసమునకు, లాభ

కరమగునట్లు, కల్పించుచున్నాఁడు. ఈదివ్యపూరుషుని, అధ్యక్షునిగాఁ గలిన. భారతసేవాశ్రమసంఘము ఆసేతు హిమాచలపర్యంతము, ఒక పెద్దసంచలనము, ఆత్మనిగ్రహోత్సాహోత్పత్తుల అభ్యాసమును ఒక పెద్దసంచలనము రగుల్కొలిపెను.

ఏసమయమున నెక్కడ కేగిన, నీపరమమునీంద్రుని దివ్యపాదసన్నిధికి, కోటానుకోట్లుగా ప్రజలు, వయోజ్ఞానస్థితివివక్షతలు లేకుండ సూదంటురాయిచే ఇనుమాకర్షింపఁబడినరీతి వ్యక్తిగతముగా నాధ్యాత్మికబోధయు, అదృష్టమున్నచో 'శక్తిసాధన' లేక శక్తిసంపాదనమునందు మంత్రసిద్ధియు, నాతనిచేఁ బడయుటకై వచ్చుచుందురు. వారిదర్శనావకాశమును తెలుపు స్థలము సమయము తేదీలు వార్తాపత్రికల మూలమునను కరపత్రముల మూలమునను వెల్లడింపబడుచుండెను.

జాతీయోద్ధరణమునకై ప్రయత్నించు ప్రతిసంస్థకు తేజస్సత్వము లావశ్యకములు. కొంచెము సావధానముగాఁ జూచినచో యీసంస్థలయుద్దేశభంగమునకు మూలకారణము శక్త్యుత్సాహలోపమే యని తెలియును. ఈశక్త్యుత్సాహము లెక్కడినుండి వచ్చుచున్నవి? ఈశక్త్యుత్సాహములకు నాత్మేంద్రియనిగ్రహసాధనయు, దేహపారిశుద్ధ్యము మనఃపావిత్ర్యములే ముఖ్యకారణములు. ఈవిషయమును మనమందరము సమ్మతింతుము.

ఆత్మేంద్రియనిగ్రహావశ్యకతను, జాతికి జాతియంతయును నిరాదరించినది. ఇది కడువిచారింపవలసిన యంశము. తత్ఫలితముగా శారీరక, మానసిక, నైతికదౌర్బల్యములకు గురియై, తత్ప్రసూతఖేదములకు పాల్పడి, వేయేండ్లదాస్యము మెడఁగట్టుకొంటిమి.

ప్రియబాలకులారా! భారతీయులారా! ఆశాభంగమునకును, అధైర్యమునకును తావీయవలదు. మనకు దుర్దశ తొలగుచున్నది; మీరు మేల్కాంచి శోభావైభవములతో విభాసిల్లుఁడు. ఈజ్ఞానమూర్తి మీశీర్షములపై పరాత్పరుని కారుణిక తేజమును విరజిల్లుచున్నాఁడు. రండు; సోదరులారా! అందఱును రండు! అధిపతికొఱకై ఆదర్శపూరుషుని కొఱకై యన్వేషించుచు, జీవితములో బహువత్సరముల [illegible] కన్గొనలేక, ఆధ్యాత్మికజ్ఞానము కొఱకై దేవులాడువారందఱును ఇటు రండు. ఈదివ్యపురుషుఁడు ఆధ్యాత్మికశక్తిస్వరూపములగు కాన్కలతో మీకై ఎదురుచూచుచున్నాఁడు. అతనిదర్శింపరండు. అతని దివ్యపాదముల కెఱఁగుఁడు. మనస్ఫూర్తిగా నాతని భక్తితో ప్రార్థింపుఁడు. అతనిని ప్రేమింపుఁడు; సేవింపుఁడు; విడువకుఁడు. మీమీసత్త్వముల నాతఁడు ప్రత్యేకముగా పరీక్షించి, వలయుబోధనసాధన మీకుఁ గావించును.

ఈ హస్తము భారతీయచిరాశయముల గూర్చియు సాంఘిక, జాతీయపునరుద్ధరణమును గూర్చియు సూచనల గలిగియున్నది. బ్రహ్మచర్యముమూలముగా ఆత్మవ్యుత్పత్తి సాధింపఁ బ్రయత్నించుచున్నవానికి ప్రథమసాహాయ్యము చేయుటకు వీలుగా చదువరికిఁగొన్ని కర్మక్షమసూత్రము లిందు విశదీకరింపఁబడినవి. తనజీవితములు ప్రభావంతములుగా చేసికొనదలచువారు, శాంతియుతముగా, నిర్మలముగా చేసికొననెంచువారు అతనిదివ్యదర్శనము చేసి స్వయముగా నుపదేశము పొందవలెను. ఆతని దివ్యాశీర్వాదము మిమ్మను గ్రహించునుగాఁత.

ఓమ్‌తత్సత్.



# సూత్రము.

—:o:—

"వ్యక్తియొక్క జీవితమునందువలెనే ప్రతిజాతిదృష్టియందు ఒకానొక యాదర్శసూత్రముండును. అదియే జీవితమునందొక ముఖ్యప్రవాహమై అభివృద్ధినంతటిని, జాతియొక్క గొప్పతనమునంతటిని, అదిఇదిఅననేల! ఆజాతియొక్క జీవితము నేనడపించును." రాజ్యాంగవిషయములలో నొకదేశమును, ఆర్థికవిషయములలో నొకదానిని, సాంఘికవిషయములలో యింకొకదానిని, ఇట్లనేకవిధములుగా అనేకదేశములను ప్రతిష్ఠకు దెచ్చును. ఇండియాలో అట్టిది ఆధ్యాత్మికవిషయికమైనది. విశ్వధనాగారమునకు భారతదేశ మర్పించుకాన్క ఆధ్యాత్మికమైనది.

"ప్రపంచకచరిత్రలో ఏదేని ఒకశక్తి బయలుదేఱి, తక్కినజాతులను వశీకృతముగా జేసికొనుచు ఖండాంతరముల నెల్ల నొక్కటిగాకూర్చినప్పుడెల్ల, భారతభూమిలో నుదయించిన ఈ ఆధ్యాత్మికప్రవాహములమూలమున ఆజాతిలోనికి భారతీయవేదాంతభావములు ప్రవహించి, ఆజాతియొక్క రక్తనాళములలో దిగబారి దానికిభారతీయవేదాంతవాసన కొంత కల్పించినవి."—వివేకానందుఁడు.

మనము హిందూదేశచరిత్రను విపులముగా గమనించితిమేని దేశమున జరిగిన ప్రతితిరుగుబాటునకు పూర్వమును

ఒకానొక ఆధ్యాత్మికప్రవాహము దేశము నట్టిట్లుచేయుట
గ్రహించగలము. శ్రీకృష్ణుఁడు, బుద్ధుఁడు, శంకరుఁడు, రామా
నుజుఁడు, చైతన్యుఁడు మొదలగు ఆధిదైవికపురుషులు భారత
భూమిలోనైన ప్రతిజ్ఞానోద్యమమును నడపించినవారలే.

భారతీయసాంఘికజాతీయరూపమగు హర్మ్యమును కట్ట
వలెనన్న దృఢమగుపునాది ఆధ్యాత్మికపుష్టియే సమకూ
ర్చును. కులము, వర్ణము, మతము, భాష, వీనినిగురించిన
అంతఃకలహములతో అభిప్రాయభేదములతో నిండియున్నను,
జాతి నిలుచుటకు తగినప్రదేశము వలయునన్నచో, ఆధ్యాత్మిక
పుష్టియే దానికి తగినచోటు. సహకారబలమును, సహో
ద్యమమును జాతికి కల్పించి, మీటినంతనే జాతినంతటిని ఒక్క
సారిగా మేల్కొలుపుజీవితసూత్రము ఆధ్యాత్మికపుష్టియొక్కటే.
భారతీయులకును. జాతికంతటికిని. అంతిమావధిగాను, పర
మాభీష్టము ఆధ్యాత్మికసిద్ధియే. ఈఆధ్యాత్మికానుభవమునకు
వ్యతిరేకముగా నడచుచు, ఆధ్యాత్మికసిద్ధియే భారతీయుల
పరమావధి యని యెంచక సంఘమునకుగాని, జాతికిగాని, ఆ
విషయమున కించిత్తైన సహాయపడక, బయలుదేరిన ఏఉద్యమ
మేనియు ఎంతటిలాభదాయకమైనను, ప్రజలచే విషసర్పమువలె
విసర్జింపఁబడును. శతాధికశతాబ్దములపూర్వమునుండి భారత
జాతీయజీవితప్రవాహము ప్రవహించుచున్నది ఈఆధ్యాత్మిక
మార్గమునుండియే. ముందును అట్లే జరుగగలదు. ఈప్రవా

డును, ఈ సంఘముయొక్క మతపతాకముక్రింద వేనవేలుగా ప్రజలందరు గుమికూడుచున్నారు. కొద్దికాలములోనే ఈసంఘముయొక్క నాయకత్వముక్రింద జాతియంతయు నిర్ణీతమై యుండుట చూడఁగలమని మా దృఢవిశ్వాసము.

ఓంతత్సత్.

---

ఓమ్

# పునరన్వేషణము.



యథాస్వరూపమగు భారతదేశమును మీరన్వేషింతురా? శతాధికశతాబ్దముల పూర్వమునుండి ఏమహనీయాదర్శములపై భారతాభీష్టములు నిలిచియున్నవో మీరు కనుగొననెంతురా? భారతీయ పూర్వగాథలలో, పరంపరాగత సాంప్రదాయములలో, భారతవ్యుత్పత్తిలో, నాగరికతలో, శాశ్వతమగు ఏశక్తి ఇమిడియున్నదో మీరు తెలిసికొనందలతురా?

అట్టైన భారతదేశములోగల ఆశ్రమముల నన్నిటిని చూచి కలహములకు దుర్నీతులకు దూరమై మానవజీవిత సహజములగు ప్రమాదములకు, ప్రపాతములకు అందక పవిత్రమై, ప్రశాంతమై, నిరాడంబరమై స్వర్గీయమగు విశ్రాంతితోడను ఆధ్యాత్మికమగు ఆవేశముతోడను విలసితమైయుండు దివ్యర్షివాటికలను సందర్శింపుడు.

ఇక్కడనుండు మహాయోగులయొక్క నిర్లిప్తమైన చిత్తములలోను, శబలితములైన భావములలోను భారతీయుల శాశ్వతాదర్శమును, భారతీయుల సుస్థిరాధ్యాత్మికసంపత్తియు నంకురించుచున్నవి. ఈమహాయోగుల విశ్వజనీనాత్మలయొక్క ఆధ్యాత్మిక నాయకత్వముక్రిందనే అసదృశమై

శాశ్వతమై, విలసిల్లు భారతీయసంస్కృతియు, నాగరికత యును, వెలయింపఁబడుచున్నవి. ఈ ఆశ్రమములలోనే ఈపుణ్యపురుషులకు పూర్ణముగా స్వకీయాత్మ నివేదనము చేసి వారిని కొలుచుచున్నయెడల, సర్వసంగపరిత్యాగము, గురుసేవ, అను రాట్నచక్రములపై భారతసంఘమర్యాదలను తంతువులు వడుకఁబడి బ్రహ్మచర్యము సత్యాన్వేషణములతో మేళవింపఁబడి వర్ణాశ్రమధర్మమను మగ్గముపై అసదృశకళా చాతుర్యములతో నేయఁబడును.

అధికారదండము వహించి కిరీటధారులగు సార్వభౌములుగాని, ఖడ్గము కేలధరించి పరాక్రమఖ్యాతులగు క్షత్రియులుగాని, ధనముతో తులదూగుచు ఐశ్వర్యోపేతులగు [illegible] తులగు తాంత్రికులుగాని, అందరును వినమితభావముతో తదీయాంఘ్రిపాదసన్నిధిని సాష్టాంగపడి శాంతికొఱకును, సాయుజ్యముకొఱకును, వారిని ప్రార్థించుచుందురు. వారి పెదవిపై గిరిన ఒక తొట్రుపాటు, కనుబొమపై నొదవిన ఒక ముడి, సామ్రాజ్యాధీశ్వరులనుండి దరిద్రుల పర్యంతము, ఒక సంఘమునుగాని, ఒకజాతినిగాని, ఉయ్యాల లూగింపగలదు. దేశము ఒక కొననుండి మరియొక కొనవరకు సంచరించుచు ఇట్లాచరించిన ఒకే ఆదర్శకల్పసూత్రమును సంఘముయొక్క

యు జాతియొక్కయు మొత్తమునుండి అనుస్యూతము గాఁ ప్రసంగలము.

భారతదేశముయొక్క దివ్యాత్మను మీరు కనుగొనఁ దలఁతురా? త్రిశుద్ధిగా యీ పరమపురుషుల ఈ దివ్యర్షుల నమ్మి సేవించి వారిచరిత్రలను, వారి పరమార్థకృత్యములను ఆలోడనము చేసినయెడల మీయన్వేషణము కృతార్థమగును.

ఓంతత్సత్.

# పరమావధి.

మానవజాతియొక్క చరిత్రలో సర్వప్రపంచకమును అజ్ఞానాంధకారములో దిగబడియున్నప్పుడు, ఐగుప్తీయులు, బాబిలనీయులు, ఎస్సీరియనులు, ఛాల్డియనులు, మున్నగు, ప్రపంచమునకెల్ల పురాతనులమని పేరుపెట్టుకొన్నజాతులు ఇంకను విజ్ఞానాంకుర విలసితములు ఐనవో కాలేదో అని సంశయాస్పదముగ నున్నప్పుడు భారతదేశము తనవైభవ శోభ దేదీప్యమానముగా వెలిగింపుచు, అభివృద్ధిలో నేమి, నాగరికతలో నేమి, వ్యుత్పత్తిలో నేమి, అసమానమగు విఖ్యాతి నార్జించి, ప్రపంచమునకెల్ల తిలకాయమానమై, గౌరవ నీయమై, గంభీరమై యొప్పుచుండెను; శతాబ్దములకు శతాబ్దములు దొర్లిపోయినవి; వేలకువేలు జాతులుపుట్టి పెరిగి విరిగి భూమి మొరకగావించినవి; అసంఖ్యాకములగు దేశములు ఒకటితరువాత నొకటివచ్చి, కళలలోను, శాస్త్రములలోను, వాఙ్మయములలోను, వ్యుత్పత్తిలోను, నాగరికతలోను, అతిశయిల్లి స్వీయవిజ్ఞానప్రవాహములచే భూమిని నప్లావించి విలసిల్లినవి; కాని జగన్నాటకరంగమున వెంటనే అవి అంతరించి వానిపూర్వమహత్వచిహ్నములను, చరిత్రలపుటలకు అప్పచెప్పినవి; కాని భారతదేశము బహుపురాతనమయ్యు అత్యంతమహనీయమై, ప్రాథమికమయ్యు, పరిధానావస్థనే

పొంది అగ్నిపరీక్షలను, అతికల్లోలములను, శతాబ్దముల పర్యంతమోహాటించి అనేకవిధములగు మార్పులు, పరిణామములను, అనుభవించి నూతనయుగావశ్యకములై తప్పించుకోరానివగు అవసరములకు తలనొగ్గి, అవలంబించుచు కూడ, ఇప్పటికిని వేయేండ్లపూర్వ మెట్లుండెనో అట్లేయున్నది!

ఐనను చారిత్రికోదయమునకు పూర్వమే ఇట్టి మహిమనొందుటకు భారతదేశము నిరంతరము ప్రవహించు ఏజల యంత్ర జీవస్రోతమునుండి యీ అమృతపుటూటలను గ్రహించి తన జీవశక్తులను ఇన్నిశతాబ్దములపర్యంతము ఎప్పటికప్పుడు పునరుత్తేజితములుగా జేయుచు పెంచగలిగినది? అంతటి శక్తితోను అంతటిధనముతోను, అంతటివైభవముతోను, అంతటి పరిపూర్ణాభివృద్ధితోను, విలసిల్లిన, గ్రీసు, రోము, ఏని వ్యుత్పత్తితోను, నాగరికతతోను అదృశ్యమైపోగా, బ్రతుకుట కీస్నికష్టములపాలై, కాలగోచరమై తక్కిన వానివలె ధ్వంసముగాక, ఏల ఇట్లింకను భారతదేశము నిలువఁబడియున్నది?

భారతదేశమునకు అమరప్రభావమునొసఁగిన ఆజల యంత్రమును అన్వేషించుచుపట్టున మనము మనదృష్టిని పురాతన భారతదేశమునందలి ఆశ్రమములవైపు మరల్పవలెను. పలితపాండుర జటావల్కలధారులై ఆదివృద్ధులు మేఘగంభీర స్వరమున ఇట్లు ఘోషించెడివారు, "చిరంజీవులగు నోపుత్రకులారా! భూనివాసులారా! స్వర్లోకవాసులారా! వినుఁడు, లోకములు తెగినతుది ఆలోకములగు పెంజీకటి కావల

వెలుగు పరమాత్మను నేను తెలిసికొంటిని; ఆతని తెలిసికొనుటవల్లనే జనులు మరణనాశనముల నొందరు. దీనికి రెండవమార్గము లేదు!"

యుగయుగములనుండి ఆర్యమనీషులు నశ్వరమగు యీ ఇంద్రియప్రపంచమును వెనుకవిడిచిపెట్టి పరతత్త్వాన్వేషణపరులై అనర్గళమగు శక్తిసారముతో అధికారుఁడు, అవికారనీయుఁడు, అద్వితీయుఁడు నగు పరాత్పరుని వైపు ఉద్గమించెడివారు. ఇట్టికఠినప్రయత్నములతో తీవ్రతపములతో హాయనములుగడచినపిమ్మట భారతీయుల ఆధ్యాత్మిక విద్యాన్వేషణము సంపూర్ణసాయుజ్యముచే ప్రసాదితమైనది. ప్రత్యక్షమగుభిన్నతమఱుఁగున పరోక్షమగు అభిన్నతయొకటి గలదనియు ఈభౌతికము కడపట నిరంతరసామ్రాజ్యమున్నదనియు తెలిసికొనబడినది; నిత్యుఁడును, శాశ్వతుఁడును, అగు పరాత్పరుని ఎఱుఁగుటచే భారతదేశమే శాశ్వతమైనది.

అందువలన భారతీయుల జాతీయదృష్టి అంతయు ఆ మహాతత్త్వమును కనిపెట్టుటకును, తన్మూలమున భారతసాంఘిక జాతీయభావముతో సామరస్యము, అనుగుణ్యమును కల్పించుటకే వినియోగింపఁబడుచున్నది; పరతత్త్వవిజ్ఞానమే ఎల్లప్పుడును భారతజాతీయజీవనమునకు పరమావధియు పరమార్థము నైయున్నది!

ఓం తత్సత్.

ఓమ్.

# ఆదర్శము

---

ఆత్మేంద్రియనిగ్రహములమూలమున పరమేశ్వరుని మొట్టమొదట సాధించినది మన భారతమహీంద్రములే! ఇంద్రియేచ్ఛాసాగరమును మించుకొని ఇంద్రియాతీతములగు తత్త్వముల మూలమున వారు పరమాత్మని అవగతముచేసికొని జాతి కిట్లాదేశించిరి, "మరణశోకహారమైన ఈలోకమున కతీతమగు పరతత్త్వమును కన్గొంటిమి; అది అందఱును బడయునగును; సర్వసంగపరిత్యాగమువలననే పడయనగును; తదితరముల వలన వలనుపడదు."

"శోకాతంకరుజా జరామరణ శృంఖలములనుండి మీరు విముక్తి నొందగోరుదురా?"

"తప్పక, అంతకంటెనా! అయిన నెట్లు?"

"పరతత్త్వజ్ఞానముచే, నిత్యుండును, శాశ్వతుండును అగు పరమేశ్వరారాధనచే—సాయుజ్యసాగరస్నానముచే!"

"ఆ పరమపురుషుని ఉనికియెచ్చట?"

"ఇంద్రియాతీతమగు స్వారాజ్యములో—సుఖదుఃఖములు, హానివృద్ధులచే జర్జరితమగు ఈ ఐహికమునకావల—"

"ఆతని నెట్లుపడయనగును?"

"పంచేంద్రియప్రపంచమును తరించి."

"ఇంద్రియప్రపంచమును తరించుటెట్లు?"

"ఆత్మేంద్రియనిగ్రహముల మూలమున, శారీరక పారిశుద్ధ్యమువలన, బుద్ధ్యంతఃకరణముల పావిత్ర్యమువలన; బ్రహ్మచర్యవ్రతానుష్ఠానమువలన, అస్ఖలితవీర్యపుష్టివలన-"

"కాని ఇంద్రియములను, విషయేచ్ఛలను నిగ్రహించుటెట్లు ? మనోవాక్కాయసంశుద్ధి నభ్యసించుటెట్లు ?"

"సర్వసంగపరిత్యాగము వలన."

"ప్రజా సామాన్యమునకు, సర్వసంగపరిత్యాగము అభ్యసించుట సులభసాధ్యమా ?"

"సులభసాధ్యమేగాని, ఇప్పటికిప్పుడు కావలెనన్నచో కాదు; తత్క్షణమే సర్వసంగపరిత్యాగము చేయుమన్న నెవ్వరి వశమునుగాదు"

ఋషీశ్వరులుకూడ భారతదేశమునకు పరమాదర్శముగ నీసర్వసంగపరిత్యాగమే యని జాతీయదృష్టిలో నిలిపియున్నారు; "సంపదవలనంగాదు; సంతానమువలనంగాదు; సర్వసంగపరిత్యాగముయొక్క-ద్వారమూలముననే అమరత్వసిద్ధి నందవచ్చును!" ఈ ఋషివాక్యములు భారతీయులహృదయములలోఁ జొఱఁబాఱి, జాతియొక్క- జీవరక్తము నుడికించుచున్నది

కావున పరమాత్మజ్ఞానము బడయనిదే, జరామరణబాధాభూయిష్టమగు నీప్రపంచబంధములనుండి విముక్తినొందలేరని నిశ్చయముగాఁ దెలిసికొనుఁడు; తత్సాధనకై సర్వ

సంగపరిత్యాగ మొక్కటే మార్గమని యెఱుంగుఁడు! కావున మీజీవితచర్యలో దైనందిన్యముగా నీనిస్సంగత్వము సక్రమముగా నభ్యసింపుఁడు! దీనినిమీరు త్రికరణశుద్ధిగా నవలంబించి అభ్యసించుచున్న యెడల, కాలక్రమమున, మీ ఇంద్రియములు, మనస్సు, బుద్ధి అన్నియు నైహికమునకు దూరదూరమై పోవుచుండుటయు, మీ ప్రత్యగాత్మ, విహంగమువలె, ఆపరమావధివైపున కెగసి పోవుచున్నట్లును కన్గొనఁగలరు.

తత్వజ్ఞానతృష్ణయు, దానికొఱకె, నిస్సంగత్వము నభ్యసించుటయు, హిందువులయొక్క జీవనదృష్టిని మార్చివైచినవి; భారతీయులు, విషయసౌఖ్యములకొఱకే గాని లేక, స్వప్రయోజన పరత్వమునకే గాని జీవించుట నిచ్ఛగింపరు! ఉన్నతోన్నతతత్వజ్ఞానమును, శాశ్వతమగు నిత్యమోక్షసామ్రాజ్యమును, ఆత్మలందు వాంఛించువారే భారతీయులని వాడుక. సర్వసంగపరిత్యాగమును సమాదర్శకమును, ఆత్మసమర్పణము, ఆత్మనిగ్రహము, ఆత్మనిరపేక్షాభావము, విశ్వమానవసేవ వీనివలన భారతీయులహృదయములందు దృఢముగా నాటుకొన్నది. పూర్వమహాత్ములచే నియంత్రితమైన యీ భారతసంఘములో జన్మించిన ప్రతిభరతపుత్రకుఁడును, శైశవమునుండియు, స్వీయజీవితమును, భౌతికాంతర్గీనమైన, భిన్నతారూపమున బయటికగుపడు భగవంతుని పాదపద్మములయందు సమాహుతి చేయుటయే పరధర్మమను భావముతో పెంచఁబడుచున్నాఁడు.

మొత్తముమీద భారతసంఘమనగా దివ్యర్షుల దేశికత్వముక్రింద నడుపఁబడుచు వర్ణాశ్రమధర్మవిద్య బోధింపఁబడుటకై ప్రతిభారతీయుఁడును ఆజన్మవిద్యార్థియై అభ్యసింపదగిన "ఒకనిస్సంగవిద్యాలయము" అనవచ్చును. ఇచ్చట ప్రతిభారతీయుఁడును శాశ్వతమైనదానిగా ఆత్మను నిగ్రహించుటెట్లో, విషయేచ్ఛలను చంపుకొనుటెట్లో, సాంఘికవృద్ధికై పాటుబడుటెట్లో, ఇతరులయొక్క సుఖమునకై స్వార్థసమర్పణముచేయుటెట్లో నేర్పఁబడుచున్నాఁడు. ఈ విధముగా ప్రతిభారతీయుఁడును ఫలాపేక్షలేని నిష్కామకర్మము నేర్చుకొనుచున్నాఁడు.

ఈ విషయములో భారతసంఘాదర్శములకును, పాశ్చాత్యసంఘములకును హస్తిమశకాంతరముగలదు. పాశ్చాత్యులు జన్మమూలకముగ, స్వత్వములను, హక్కులను సంపాదించుకొనుటకు నేర్చుకొందురు. కాని భారతీయులో జన్మమూలకముగ పరాభ్యుదయమునకై స్వీయస్వామ్యముల సమర్పించుటెట్లో అభ్యసింతురు. పాశ్చాత్యులు ఆత్మసంభరిత్వమునకు, ఆత్మభోగములకు, ఆత్మప్రయోజనములకు ఆత్మవిఖ్యాతికే ఎక్కువమూల్యమిచ్చెదరు! కాని సంఘసేవ, దేశసేవ, విశ్వమానవసేవకొఱకైన సమర్పణము, ఆత్మనిగ్రహము ఆత్మనాశనము భారతీయులు గర్భమునుండి అభ్యసింతురు

కాని పాశ్చాత్యదేశములో సాంఘికజాతీయజీవనము లెడతెగని విప్లవములకు పోరాటములకు నగ్గమై శాంతియు, స్వేచ్ఛయు సామరస్యమును లేక యుద్ధరంగములవలెనున్నవి. కళలలోను, శాస్త్రములలోను అసమానవైదగ్ధ్యమును వారు సంపాదించిరిగాక. కుబేరుని యైశ్వర్యముతో వారు తుల తూగుచున్నారుగాక. ఏమికార్యము ?

పాశ్చాత్యుల విషయానుషంగభావములతో సంగతులమై మనము నేడు పవిత్రములగు మననిస్సంగత్వము లోకసేవ అను నాదర్శభావములను విడచిపెట్టుచున్నాము. ఎంతవరకు మనమాదివ్యాదర్శములనుండి దూరమైతిమో అంతగా మనసాంఘికజాతీయ జీవనములలో శాంతియు సామరస్యమును క్షీణించుచున్నవి. కాని పాశ్చాత్యదేశములలోని తెంపులేని పోరాటములకు కలహములకు వీనిని పోల్చి చూచినచో మనయులజడులు వానిలో శతాంశమైన నుండజాలవు.

నేడు ఆశాశ్వతాదర్శములను తిరిగి స్వీకరించెదమని యే జాతిఘోషించుచున్నది. కనుక మనము సర్వసంగపరిత్యాగమను నీయున్నతాదర్శము మరువక, దానియనుగుణమగు విశ్వమానవసేవను విస్మరింపక, వర్తించుచున్నయెడల మనజాతి యుద్ధరింపఁబడుటకు నేసంశయమును లేదు.

# విజయయాత్రావిధానము.



నేఁడు భారతదేశపరిస్థితులు, మతవిషయమునందేమి సాంఘికవిషయమునందేమి, రాజకీయవిషయమునందేమి ప్రపంచములోని ఏ ఇతరదేశముయొక్క పరిస్థితులకన్నను క్లిష్టములై క్లేశావహములై యున్నవి. దేశము నేఁడనుభవించుచున్న, సంక్లిష్టసమస్యలను వానినుండి విడిబడు విధానమును ఆలోచించుటకు పూనుకొనిన మనకొక్కసారి మతిబోవుచుండును.

మతవిషయములలో శుద్ధమూఢులమై, అనావశ్యకములగు వానిని పెక్కింటిని బట్టుకొని ప్రేలాడుచు, తత్వమును, ఆదర్శమును, విడిచిపెట్టి మూర్ఖమగు మతాభిమానమును వహించి అన్యోన్యము కలహించుచున్నాము. అన్యదేశసాంప్రదాయములచే మోహపెట్టబడి, వేయేండ్లనుండి, వరుసగా జాతీయసహజములగు, ఆదర్శములను విడిచిపెట్టుచు, సాంఘికాచారములను వలలలో చిక్కుపడి పైకిరాలేక పరితపించుచున్నాము. తన్మూలమున మనప్రస్తుతసంఘము వట్టిఆచారములచేతను, వట్టిసంస్థలచేతను, అలంకృతమైన ఒక నిర్జీవశవమువలె తయారైనది. రాజకీయముగను ఆర్థికముగను సంవత్సర సహస్రముల పర్యంతము ఉదాసీనులమై,

దాస్యమునకు లోనైతిమి. పవిత్రమైన భారతీయవ్యుత్పత్తియు, భారతీయనాగరికతయు, విస్మరింపఁబడుటఁజేసి పాశ్చాత్యవ్యుత్పత్తికి, పాశ్చాత్యనాగరికతకు, దాసులమై, తద్వ్యామోహమునఁబడి అవి ప్రాకృతములని యైనను, కృతకములనియైనను, తెలిసికొనక, దాని వెంటఁబడి ప్రాకులాడుచున్నాము.

భారతీయులదుస్థితి నేఁడెంత భ్రష్టముగా నున్నను, ఎంత క్లిష్టముగానున్నను, సులభసాధ్యముగాకున్నను తన్నివారణోపాయము మనకు తెలియకపోలేదు.

సంవత్సరశతములనుండి, అంధకారపిహితమైయున్నఁ ఈ భారతదేశమను కారాగృహము, నేఁడొక కరదీపికచే, వెలిగింపఁబడుచున్నది. ఎంతధనమున్నను, ఎంతశక్తియున్నను [illegible] చేయఁబడుట స్వప్నవార్త. [illegible] కలమని [illegible] ఎంత రాజకీయ కల్లోలము నొనరించినను, ఎంత సంఘసంస్కారము గావించినను, ఎంత ఆర్థికాభివృద్ధికి పాటుబడినను, ఇట్టి మానసిక పను లెన్ని జేసినను, భారతజాతీయముక్తికి కొంచెమైన తోడ్పడఁజాలవు.

ఆత్మికసముద్ధరణమందే జాతికి విముక్తిగలదు; భారతీయచరిత్ర నొక్కసారి పరికించినయెడల మున్ముందు ఆధ్యాత్మికవిప్లవము లేనిదే, ఏవిధమైన కల్లోలమును దేశమున

బయలు దేర లేదని మనము గ్రహింపఁగలము. కనుక ప్రతి జాతీయ సంస్కారమునకును భారతజాతికి సమున్మేషణమగు ఆధ్యాత్మికవిప్లవ మొకటి అత్యావశ్యకమై యున్నది. కనుక నేఁడు మన ప్రధానకర్తవ్యమేమన దేశము ఆకొననుండి ఈ కొనవరకు, ఆధ్యాత్మికభావప్రవాహములచే ముంచి ఎత్త వలయును. దానిని జేయుటకై నను, మతప్రవక్తలుగాని, కేవలసిద్ధాంతులుగాని, శుష్కగ్రంథకవాదులుగాని, మతాభిమానులుగాని, శాఖాభిమానులుగాని పనికిరారు.

దానికై విజ్ఞానమూర్తియగు ఒక ఆధ్యాత్మికపురుష సింహుఁడు, కరతలామలకముగా తత్త్వమును గ్రహించి, ప్రజా హృదయములను ఆధ్యాత్మికావేశముతో నింపి, వారియాత్మలకు శక్త్యుత్సాహములను సమకూర్పగలుగువాఁడే ఈ మహాకార్యమును నిర్వహింపవలయును. అప్పుడు సహజముగనే, జాతియంతయును శక్త్యావేశములకొఱకు అతనిచుట్టును చేరును. అపాయాకులమై, పరాధీనమై అధఃపాతాళమునకు, అణగద్రొక్కబడి, దాస్యమునకు ఉదాసీనతకు, తప్ప వేరొక దానికి పనికిరాక, ఇడుములగుడుచుచున్న మనజాతి అడుగడుగునకు, అధైర్యమును, దౌర్బల్యమును, నిరాశను, చూపుచున్నది. ఈఆపన్నదశలో దానిని రక్షింపఁగలుగు పుణ్యాత్ముఁడెవ్వఁడు? ఏదిదానికి ధైర్యముకూర్చును ?

ఇక్కాలమున జాతీయవిమోచనముకొఱకు భారత దేశములో అనేకములగు సంస్థలు పాటుబడుచున్నవి; వాని కన్నిటికిని శిరోమణియై వెలయుచున్నది భారతసేవాశ్రమ సంఘమెుక్కటే ? దానిగొప్పతనమేమన దానిని నడపించు వాఁడు మానవాతీతుఁడును, దివ్యపురుషుఁడును, ఆధ్యాత్మిక వేత్తయు, అగు ఒకపరతత్వనిధి; జాతియంతయు ఈసంఘ మునెుుక్క మతపతాకముక్రింద ఆతని ఆశ్రియమునొందుటకై పరుగెత్తుకొనివచ్చుచున్నది; పంజాబులోను అస్సాములోను ఈసంఘము కృషిచేయుటకు మెుదలుపెట్టినదగ్గఱనుండి ప్రజ లు దానిఆధ్యాత్మికనైతికాదర్శములనే ఆకర్షింపఁబడి లక్షల కులక్షలు పెద్దలనక, చిన్నలనక, వృద్ధులనక మతావేశముగలి గిన ప్రతివారును దీనినాదరించు, ఈసంఘమాచరించుచు బో ధించుఆత్మవిద్యకు తగినకట్టుబాట్లను అవలంబించుచున్నారు.

ఒకజాతికి ఎన్నోవిధములగు అభివృద్ధులును, ఆచరణ లును ఉండును. కావున జాతీయవిమోచనమనగా అన్నిశాఖ లలోను ఒక్కసారిగా నభివృద్ధిగల్పించుటయే. భారతసేవా శ్రమసంఘము భారతజాతీయవిమోచనమునకై పాటుపడు చు, ఎన్నియోనాళ్ళనుండి ఆధ్యాత్మికము, నైతికమును, విద్యావిషయికమును, ఆరోగ్యవిషయికమును, పారిశ్రామిక మును నగువిషయముల లెన్నిటినో సంవృద్ధిచేయుటకు కృషి సల్పుచున్నది.

కావున ఈవిషయములన్నిటిలోను దేశమునకు సమానాభివృద్ధి కల్పించుటకు ముందుగా దేశములో ఆధ్యాత్మిక నైతికవాతావరణము గల్పించుటయే యీసంఘము తన ప్రధానకర్తవ్యముగా నెంచుచున్నది; ఈయుద్దేశమును దృష్టిలోనుంచుకొని పిల్లలను, పెద్దలను, వృద్ధులను వేనవేలుగా చేరదీసి ఈసంఘము వారి కనేకవిధములుగా "శక్తిసాధన" లేక బ్రహ్మచర్యానుష్ఠానము లేక ఆత్మవృత్త్యుత్పత్తిసమార్జనమును గఱపుచున్నది.

దీని తరువాతప్రకరణములో ఆత్మవృత్త్యుత్పత్తి నాచరించుటకై ఈసంఘము బోధించు కొన్ని సామాన్యధర్మములు వివరింపఁబడుచున్నవి.

ఓమ్.

ఓమ్.

# సారాంశము.

ప్రధానాంశములని అప్రధానాంశములని ప్రతిమతము లోను కొన్ని ఇమిడియున్నవి. ఈ ప్రధానాంశశూన్యమైన మతమునకు మతమను పేరు సార్థకముగా నేరదు. ప్రతిమతమును ప్రధానాంశములతోఁబాటు—తప్పనిసరిగా కాకపోయినను తదవలంబన ప్రాయముగానైనను—ఈ అప్రధానాంశములను గూడ కలిగియుండును. కాబట్టి ఏజాతి మతవిషయికముగా కొంచెము హీనస్థితియందుండి ఉన్నతాదర్శములను గ్రహింప లేకుండునో అద్దానికి ఈ అప్రధానాంశములు అనగా ఈ ఆలంబన భాగములే, మతమునకు ముఖ్యావసరములై యున్న వి. ఉన్నతాదర్శములు జ్ఞానము ఎక్కువ ఎక్కువగా సమా ర్జించినకొలది మనుష్యులకు ఈ అప్రధానాంశములు అనావశ్య కములగును.

మతమునకు అప్రధానాంశములనగా నెవ్వి? సిద్ధాం తములు, మూఢవిశ్వాసములు, వైదికగ్రంథములు, తద్వ్యా ఖ్యానములు, సువార్తలు, మతగ్రంథములు, దేవాలయములు, ప్రార్థనామందిరములు, ఉత్సవములు, ఊరేగింపులు, పూజా

రులు, విగ్రహములు, మొదలగునవి మతమున కప్రధానాంగములు.

ప్రపంచమునందున్న ప్రధానమగు మతములన్నిటికి ఈనిస్సారాంశములమూలముననే విభాగవిభేదము గలుగుచున్నది గాని సారాంశములయందు గాదు; హిందూమతము, మహమ్మదీయమతము, క్రైస్తవమతము, బౌద్ధమతము, ఈ అప్రధానాంశములనుండి వేఱుజేసినచో నన్నియును ఒక్కటిగానే కన్పడును; వేనికిని భేదముండదు.

అట్లైనచో సర్వమతసమన్వయకారకములైన ఈ సారాంశము లెవ్వి? మతమునకు సారాంశములనగా: ఆత్మవ్యుత్పత్తి, ఆత్మజ్ఞానము అను ఈ రెండే. ఆత్మవ్యుత్పత్తి బ్రహ్మచర్యానుష్ఠానమువల్లను, ఆత్మేంద్రియనిగ్రహమూలముననుసుసాధ్యమగును. ఏమనుష్యుఁ డెంతెంతగా బ్రహ్మచర్యవ్రతనిష్ఠయందు పాదుకొనుచున్నాఁడో అంతంతగా, వానిమనస్సు, బుద్ధి, దివ్యజ్ఞానవర్చస్సుచే ప్రకాశవంతములుగా జేయఁబడుచున్నవి. ఇక నాత్మనిగ్రహాచరణమందురా! తత్త్వాన్వేషణము, విశ్వమానవసేవ, సోదరభావము, భౌతికాంతర్లీనమగు నయ్యతీతవ్యక్తిని కనుగొనుప్రయత్నము, వీనివలన నవి సుసాధ్యములగును.

ఈ అప్రధానాంశము లను మాయావాగురములలో జిక్కి జనులెప్పుడెప్పుడు ప్రధానాంశములను మఱతురు. తుట్టతుదకు ఒకానొక అతీతపురుషుఁడు వచ్చి ప్రజలను సజీవములగు తనబోధనలచే, సారమేదో, నిస్సారమేదో, ఆదర్శమేదో, అవసరములేవో వారికి తెలుపుదు.

ప్రస్తుతమున భారతజాతీయజీవనమునకు ఇట్టి ఆధ్యాత్మికదారిద్ర్యము చుట్టుకొనినదిగనుక, ఈదృశమగు రాజకీయదాస్యము, ఆర్థికదుర్గతి, సాంఘికోత్పాతములు, దుర్నీతులు అన్నియు బయలుదేరినవి.

కనుక ప్రప్రథమమున భారతసేవాశ్రమసంఘము యొక్క ఉద్దేశము, కార్యపద్ధతి, ఏమనగా, సంఘమును, జాతిని బ్రహ్మచర్యానుష్ఠానమునకును, ఆత్మనిగ్రహమునకును మరల్చి తన్మూలమున జాతికి శక్త్యుత్సాహములను సమకూర్చుటయే! జాతియు కాలక్రమమున కొంచెముకొంచెము పుష్టిని చైతన్యమును సేకరించుకొని దృఢమగుచున్నకొలఁది దాని యభివృద్ధికి కారణములగు వివిధశాఖలయొక్క కృత్యములందును ఈక్రొత్తగా ఆర్జించుకొనినశక్తిని చొప్పించి ఈ విధముగా జాతి నుద్ధరించవలయును.

ఈసంఘముయొక్క కార్యక్రమము కేవలము గ్రంథస్థము అభిప్రాయమాత్రము గాకుండ అప్పుడే ఆచరణలోనికి

తేఁబడినది. ఈకొలఁదిసంవత్సరములలో లక్షలకులక్షలజనులు యీసంఘమువలన "సాధనా" ప్రసాదమును బడయఁగలిగిరి.

ఈసంఘద త్తమగుసాధనకు ప్రధానలక్షణము లేవనగా హిందూమతమునకు గాని, మహమ్మదీయమతమునకు గాని, క్రైస్తవమతమునకుగాని, తదితరమగు ఏమతమునకు చెందనిండు—వైష్ణవుఁడుగాని, తురుష్కుఁడుగాని, శాక్తేయుఁడుగాని, తదన్యమగు ఏజాతికి చెందినను చెందనిండు—ఏవర్ణమునకు, ఏ మతమునకు, ఏగోత్రమునకు చెందినను చెందనిండు—న్యాయవాదికానిండు—వైద్యుఁడుకానిండు—విద్యార్థికానిండు; గృహమేధి కానిండు; ఉద్యోగస్థుఁడు కానిండు; వ్యాపారస్థుఁడు కానిండు; ఎవ్వరయిననుసరే: జాతిస్థితిమత విపక్షతలు లేకుండ, ప్రతిమనుష్యుఁడును ఈసాధన నభ్యసింపవచ్చును. ఆధ్యాత్మికము, నైతికము, బుద్ధ్యాత్మికము, శారీరకము నగు సత్వమును సంపాదించుటకై ఈసాధన ఉద్దేశింపబడినది.

జాతియొక్క అదృష్టముచేత, ఒకఆధ్యాత్మికశక్తియును, శక్త్యుత్సాహముల పేటికయును, తదితరమహనీయశక్తు లెన్నియోగలసి శ్రీమత్ ఆచార్య స్వామి ప్రణవానందజీయొక్క స్వరూపమున బయలుదేరినవి. ఆయనయే యీసంఘమును స్థాపించి అధ్యక్షుఁడై శతసంఖ్యాకు లగుజనులను తనయొక్క

మహనీయకారుణికాతపత్రముక్రింద స్వయమగునోజశ్శక్తిచే ఆకర్షించుకొనుచు వారిని నవనవోత్సాహావేశపూరితులనుగా గావించుచున్నాఁడు.

కనుక యీఅపూర్వదివ్యావకాశము పోగొట్టుకొనవలదనియు ఏవిధమగు వివక్షతాభిప్రాయములు లేకుండ జాతి అంతయు వచ్చి ఆమహామహుని సేవించి తల్లబ్ధప్రసాదమును బడయుదురుగాక! యని మేము హెచ్చరించుచున్నాము.

ఓంతత్సత్.

ఓమ్

# నవీనవిశ్వైకమతోద్దేశ్యము.



1. పరమావధియేది ?

ఆత్మజ్ఞానము, విమోచనము.

2. మతమన నేమి ?

సర్వసంగపరిత్యాగము; ఆత్మనిగ్రహము; తత్వాభినివేశము; బ్రహ్మచర్యానుష్ఠానము లేక అస్ఖలితవీర్యపుష్టి.

3. నిజమైన మరణమేది ?

ఆత్మవిస్మరణము !

4. యథార్థమగు జీవనమేది ?

ఆత్మావబోధ; ఆత్మజ్ఞానము.

5. నిజమగు పుణ్యస్వరూపమేది ?

శౌర్యము; పుంస్త్వము; పురుషకారము; జ్ఞానతృష్ణ.

6. నిజమగు పాపస్వరూపమేది ?

దౌర్బల్యము; భీరుత్వము; విహ్వలభావము; నైచ్యము; స్వార్థపరత్వము.

7. ఉత్తమోత్తమము లగుశక్తులేవి ?

స్థైర్యము; ఆపద్ధైర్యము; సహనము.

8. అత్యుత్కృష్టములగు సంచితములేవి ?

ఆత్మవిశ్వాసము; గుండెనిబ్బరము; ఆత్మాభిమానము.

9. అత్యంతము ఘోరమగు శత్రువులెవ్వరు ?

బద్ధకము; జడత్వము; నిస్తబ్ధత్వము; పంచేంద్రియములు; వ్యసనోన్ముఖత.

10. అత్యంతము సన్నిహితులగు స్నేహితులెవ్వరు ?

ధైర్యము; చైతన్యము; అభ్యుదయక్రమము.

11. హృదయమధ్యము నిరంతరము ఆత్మజ్ఞానజ్యోతిజ్వలనము నొందించుకొనుటకేమి చేయవలెను ?

నిరంతరాత్మమననము, ఆత్మవితర్కము, ఆత్మవ్యుత్పత్తి సాధించవలెను.

12. ఇంద్రియోద్వేగము, వ్యసనవేదన నుండి తప్పించుకొనుటెట్లు ?

'బ్రహ్మసత్యమ్ జగన్మిథ్యా' యనియు, శరీరము లశాశ్వతములనియు తెలిసికొని నిరంతరము నశ్వరత్వము, మృతినిగూర్చి చింతన చేయుటవలన.

13. ఎట్టి పరిస్థితులలో మనహృదయములందు విషయేచ్ఛలావిర్భవించును ?

ప్రేమ, అనురాగము, లంపటమువలనను, విషయబంధములవలనను.

14. మనుష్యునిలో యీదౌర్బల్య మెచ్చటనున్నది?

విషయసౌఖ్యముల తృష్ణలోను, విషయేచ్ఛలలోను అంతరాత్మజ్ఞానము లేకుండుటలోను, వివేకము, నిర్లిప్తత లేకుండుటలోను.

15. మనోదార్ఢ్యమును చిక్కఁబట్టి, జీవశక్తిని మేల్కొలుపు టెట్లు?

వ్యాస వాల్మీకి వసిష్ఠాది మహాయోగులయొక్కయు, శుకదేవ, శమీక, శంకరాచార్య ప్రభృతులగు మహాత్ముల యొక్కయు, జనక, యుధిష్ఠిర, శ్రీరామచంద్ర ప్రముఖులగు, రాజర్షులయొక్కయు, శ్రీకృష్ణ, భీష్మార్జున ముఖులగు మహావీరులయొక్కయు, శిబిదధీచి దిలీపాదులగు దివ్యపురుషుల యొక్కయు, దానకర్ణ జిమూతవాహన హరిశ్చంద్రాదులగు వదాన్యశేఖరులయొక్కయు, సంతానమే మనమనియు, వారి యొక్క దివ్యరక్తము మనరక్తనాళములలో కూడ ప్రవహించుచున్నదనియు, ఎప్పటి కప్పుడు మన ఆత్మవిశ్వాసమును ఆత్మశక్తిని మనమింతటివారమను హెచ్చరికతో మేల్కొలుపుచుండినయెడల మనకు మనోదార్ఢ్యము చెడక జీవశక్తి చెదరక నిలిచియుండును.

---

ఓమ్.

# జాతీయావబోధము.

-:o:-

ఆత్మేంద్రియ నిగ్రహాశక్తులు భారతవర్షమున పంచబంగాళములై పోయినవి. అవిలేనికొఱతను దేశము శోచనీయముగా ననుభవించుచున్నది. మహోద్యమములని పేరుపెట్టి పనికిమాలిన గందరగోళము చేయుచున్న నేటి భారతీయులయొక్క కాళ్లక్రింద కన్నములు త్రవ్వుచు, వారిని దిగలాగుచు, తనయొక్క అనర్గళ వేగముచే, వారిపాదములక్రింద నాధారభూతముగానున్న, ఆరోగ్యసౌభాగ్యములను, ఐశ్వర్యాభ్యుదయములను, ఆశావకాశములను, శక్తిసామర్థ్యములను పుంస్త్వపురుషకారమును డొల్లవార్చుచు భీషణమగు కలుష ప్రవాహ మొకటి పాఱుచున్నది. అది మనల నెప్పుడీయగాధగర్తములలోనికి దించునో ఎవ్వరెఱుఁగరు.

కాని! ఆహా, విధివిలాసవిచిత్రమే మోగాని ఇట్టి నికృష్టావస్థయందుండియు—ఉపన్యాసవేదిక లెక్కి, సమాజములలో, మతసభలలో, సంసర్గములలో సమవాయములలో పత్రికలలో, ప్రచురణములలో, దేశభక్తిని కురిపించి, వఱదలుగా పాఱించి, కటాటోపము, అట్టహాసము చేయుచు, ఆకాశము, భూమి బ్రద్దలైపోవునట్లుగా గొంతు చెక్కలుచేసికొని

మహోపన్యాసము లిచ్చుచుండుము. కాని క్రియమాత్రము సున్న. కాని ఓ దేశభక్తులారా! మీకండ్లయెదుటనే మీచారింతగా ఏదేశమునకై పాటుబడుచున్నారో, ఆదేశమాత గర్భమునందేపుట్టి ఆదేశమాతయొక్క గృహద్వారమునందే, అమాయకులై, సుసుకోమలులై, ముగ్ధస్వభావులుచున్న పసిపాపలనేకులు, అహోరాత్రములు, అగాధములగు కల్మషగర్తములందు, బుజబుగోతులందు, కూలి, దిగబడి, పొర్లుచు పైకిరాలేక, దుఃఖనిరాశాహతచిత్తములతో, దుర్మార్గులగు స్నేహితబృందముతో, దుర్మార్గకృత్యములతో, దుర్మార్గసంభాషణలతో, దుర్మార్గములగు ఆలోచనలతో, వ్యసనముల పాలంబడుచు, నడుము విఱిగిన పసరములై, తోలుతిత్తులై, ఆరోగ్యములేక, దేహదార్ఢ్యము లేక జ్ఞాపకశక్తిచే నశించి, పుణ్యమువలన భ్రష్టులై, ఒకరికిద్దరై, ఇర్వురకు ముప్వురై, వేలకు వేలై, లక్షలకు లక్షలై, గతిగానక, యెందఱెందఱు దినదినమును మగతనము గోల్పోయి, నపుంసకులగుచున్నారో చూచుచున్నారా? అయ్యయ్యో, చూచుచున్నను ఆశోచనీయావస్థ మీహృదయములను చీల్చివేయుట లేదా? హృదయతాపమును పొందియు మీరు దానిని నివర్తింపయత్నింపరా?

అమాయకులగు బాలురు పైపై బండారములకు మోసపోయి, బహిర్వ్యామోహములకు ఆశించి అజ్ఞానముచే మూఢులై, చివరకు తమ్ముతాము తెలిసికొనవచ్చుసరికి తమ

కర్తవ్యమేదో, గమ్యస్థానమేదో తెలియక కటకటంబడుచు న్నారు. పాపము వారికి అదిగా దిట్లుచేయుమని చెప్పువారై నను, వారి నిరాశాహృదయముల నుత్సాహపూరితములుగ గావించువారైనను, తుదకు వారిఁజూచిజాలినొందువారైనను ఒక్కరును లేక వారు జాలినొందుచున్నారు. అయ్యో! మమ్ము జూచి ఒక్క కన్నీటిబొట్టు విడువరాయని వారు హాహాకార ములను సల్పుచున్నారు. వారో! మనసువిప్పి తమపెద్దవారితో తమదుర్గతిని చెప్పుకొనలేకున్నారు; వారిగురువులైనను వారిని యాదరింతురను నమ్మకము వారికి లేదు. భారతవర్షమునకు అలంకారప్రాయములై, భవిష్యద్దేశోద్ధారకులై అమూల్యము లగు ఈజాతీయకుసుమములు, హృదయములలో లోన కుమిలి పోవుచు వ్యసనబాధచే వాడి వత్తలై పోవుచు వారిరహస్య వేదనలను చెప్పుకొనలేక చెప్పినను వినువారు లేక ఎల్లు నాశ నమై పోవుచున్నారకటా !

భారతబాలకులారా ! యువకులారా ! ఇకభయపడ కుఁడు. ఇక నిరాశనొందకుఁడు. నేటికి మీయరణ్యరోదన ములు, అత్యధిక ప్రభావశాలియు, అతికరుణార్ద్రచిత్తుఁడును, నగునొక మహనీయుః చెవిని బడినవి. అదుగో ! కనుగొనుఁ డు! జగదవనదండహస్తుఁడై, సస్మితరుచిరారవిందవదనుఁడై, సరససంభాషణాచతురుఁడై, స్వవచనావధూత సర్వజనవిక్లే శుఁడై, త్రిభువన విజయక్షమమగు కారుణికత్వముచే, తన

స్పర్శనెల్లెడభారాన్వితముగా నొనర్చుచు, మీ గుమ్మము చెంగటనేనిలిచి, మీ బాధలను మాన్పి, మిమ్ముద్ధరించుటకై వచ్చియున్నాఁడు. అతఁడోఁ మీరక్షకుఁడు ! మీయందలి లోనను చల్లారిపోయిన శాశ్వతమును, అనంతమును అగు శక్తిని, ఓజస్సును, రగుల్చుట కీయనపూనుకొన్నాఁడు.

దిగాలబడి, పాలిపోయిన మొగములు వ్రేలాడవైచి కొని తిరుగుచున్న అధునాతనభరత బాలకులయొక్కయు యువకులయొక్కయు వదనములందు, మరల నలనాటిబ్రహ్మ వర్చస్సు, బ్రహ్మానందభావము, ఆరోగ్యము, ఆహ్లాదములను వెలిగించుటకై యీముని భగీరథప్రయత్నము సలుపుచు న్నాఁడు. ఆసేతుహిమాచలపర్యంతముగు నార్యావర్తభూ మియు ప్రతిధ్వనించున ట్లొక్కసారి 'భయములేద'ని గర్జిం చుచున్నాఁడు. నిరాశానాశనములవైపే ఎప్పుడును ముల్లు చూపుచున్న యీదినములందైనను, శక్తిని, పావిత్ర్యమును బడయుటకు రహస్యమైన 'బ్రహ్మచర్యసాధన'ను ఆతనిఆర్ష పాదసన్నిధిని గూర్చుండి, బాలకయువకసైన్యము లభ్యసించు చున్నవి.

భారతమాణవకమా! విశ్వవిశ్వంభరా చక్రమును తల్ల క్రిందుచేసి గాలింపుము—చింతాసమయములో చేదోడు వాదోడై, కష్టకాలములో కాచువాడై బ్రోచువాఁడై,

భయావహతరుణములో బాపువాడై ఓపువాఁడై, నిరాశనుండి తరింపజేయు మహనీయకరుణామూర్తి, ఇట్టి పుణ్యపురుషుఁడు మీకు లభింపఁడు.

కావున, ఆత్మప్రవృత్తిని, ఆత్మేంద్రియ నిగ్రహమును సాధించుకొనుటకై భారతపుత్రుల హృదయములలో బలవత్తరముగా నంకురింపఁజేయుమని మేము దేవుని ప్రార్థించుచున్నాము. కాన భారతీయులందఱు, ఆచార్యదేవుని ఆర్షపాదస్పర్శచే నాకృష్టులై 'శక్తిసాధన' నభ్యసించి వారి సంసారమును, సంఘమును, జాతిసర్వస్వమును వారి ఉన్నతస్వభావమువలనను, ఉత్కృష్టప్రజ్ఞవలనను కృతార్థములుగా జేయుదురుగాక.

ఈపుస్తకములో ఏవోకొన్ని మాత్రమే తద్విధానముల నుదాహరించియున్నాము. విపులముగా తదభ్యాసమునకు కోరకొనువారు, ఆచార్యదేవుని సన్నిధానమునకు రావలయును.

ఓమ్

# యువకులకు, బాలకులకు.



వీర్య సంధ్యమే, శారీరక, బుద్ధ్యాత్మిక, నైతికాధ్యాత్మికములగు శక్తిని, ఓజస్సును సంపాదించుకొనుటకు, ప్రథమమును ప్రధానమును అగు సాధనము. భుజించినబహళ ఆహారపదార్థముల చేత ఒక్కవీర్యబిందువు స్వల్పముగా లభ్యను. వీర్యమే మన ప్రాణము; వీర్యమే మనకు చైతన్యము గలిగించును. వీర్యమే శక్త్యుత్సాహములకు, ఓజోమహోద్యమములకు, బలమునకు, జ్ఞాపకశక్తికి, కారణమైన సత్త్వము.

శాస్త్రపరిశోధనలచే, విద్యుచ్ఛక్తి, రోదశ్శక్తి, మొదలగు నవీనశక్తులు అనేకములు బయటబడుటచు, తఱచుగా వినియుందురు, లేక, చదివియుందురు. కాని, ఈవీర్యశక్తితో సరిపోల్చుటకు, అవిఎందుకును పనికిరాకపోవును.

"పూర్ణముగా ఇంద్రియనిగ్రహము సాధించినటువంటి పురుషుడు దేవుడేగాని మనుష్యుడుగాడు; అతనికి దుస్సాధ్యమైనది ఈప్రపంచమునందేదియును లేదు." అని దేవాదిదేవుడగు శివుడు చెప్పినమాట తథ్యమే; ఒక్కవీర్యబిందువులో సహస్ర వజ్రముల శక్తి దాగియున్నది; దివ్యశక్తియైనను, ఇట్టిశక్తి గలిగినటువంటి పురుషునిముందు ఓటమి పొందునని చెప్పనేడ

నికమానవశక్తినిగూర్చి వేఱుచెప్పవలసినపనియేమి? చతుర్దశ వత్సరములు ఇంద్రియ నిగ్రహమునలిపి లక్ష్మణుఁడు, క్షుత్పిపాసాసుషుప్తులను జయించి ఇంద్రునకుగూడ జయింపరాని మేఘనాదుని సంహరించెను; జీవితకాలమంతయును బ్రహ్మచర్యము నలిపెను గనుకనే పితామహుఁడగు భీష్మదేవుఁడు ఇరువదియొక్కమారు క్షత్రియులను సంహరించిన పరశురామునినైతము జయించి, మృత్యువునుగూడ జయింపగలిగెను. ఇట్టి మహనీయేంద్రియనిగ్రహముచేతనే భారతవీరాగ్రేసరుడగు అర్జునుఁడు, దైవతతుల్యులగు రాజులను, రాక్షసులను, దానవులను నిర్జింపకలిగెను.

ఈవీర్యమును బహుశ్రద్ధాతపశ్చర్యతో కాపాడుకొన్నయెడల, కడపటి ఎనిమిదవదియగు దివ్యశక్తి లేక 'ఓజస్సు'ను గలిగించును; దీనినే పాశ్చాత్యులు 'మానవాకర్షణశక్తి' యందురు. ఈ ఓజస్సే మనుజునకు అన్యవశీకరణశక్తిని ప్రసాదించును. ఈవీర్యస్తంభనమే భూతభవిష్యద్వర్తమానకాలజ్ఞత భారతర్షులకును భారతమునులకును గలిగించెను.

మీరు మీవీర్యముకు చక్కగను, శాంతముగను, ఉంచుకొన్నయెడల మీశరీరము ఉక్కునరములతోను, ఇనుపకండరములతోను, నిండియుండును. వీర్యము మెదడునకెక్కు అచ్చటనున్న సూక్ష్మస్నాయుకోశములకు పుష్టినిచ్చును;

బ్రహ్మచర్యముచే మనశ్శక్తికూడ అత్యధికముగా నతిశయించును.

బ్రహ్మానందమునకెల్ల వీర్యమే మూలకారణము, వీర్యమే మనుభవించిన ఆహ్లాదము; వీర్యమును భద్రముగా నుంచుకొనిన ప్రతిబాలకుని హృదయము సంతోషముతోను, సంతుష్టితోను, శాంతితోడను, సౌఖ్యముతోడను నిండియుండును. క్రమముగా నాతనిహృదయము శాశ్వతాశాంకురముల తోడను, శాశ్వతసంతోషముతోను, శాశ్వతసౌఖ్యముతోను వికసించుచుండును.

ఇంద్రియనిగ్రహము చేయుడు; మీకు పూర్ణారోగ్యము గలుగును. మీశరీరము నిరామయముగానుండి ఉష్ణశైత్యములను సమముగా సైరింపగలుగును. మీదేహము సుందరమై, సుభగమైయుండుటచే మీకు దేహబాధలేమియు లేక ఉల్లాసముగానుండును. కనుక మీకు మధురమగు కంఠస్వరము గలుగును. మీరు ఇంద్రియనిగ్రహమాచరించుకొలది క్రమముగా మీసంభాషణ సుసంగతముగానుండును. మీరుచేయుపనులు సక్రమములైయుండును. స్వభావములు ప్రశాంతములై ఆనందదాయకములైయుండును. ప్రవర్తనలు నియమితములై సులభములైయుండును హృదయము నిర్భయమైయుండును. బ్రహ్మచర్యానుష్ఠానమువలన మీరు యథార్థవాదులై అంతశ్శుద్ధికలిగి ఉద్యమశక్తిగలిగి సంభాషణలోను, పవిత్రన

లోను మనోహరులైయుందురు. వీరిచూపులు హృదయాహ్లాదకములును, చిరునవ్వులు మధురములుగను,మాటలు ప్రియములుగను ఉండును. దేవతలను అమరులుగా చేసినఅమృతశక్తి ఈవీర్యమే. వీర్యస్తంభనమువలననే మనుష్యుఁడు జీవితాంతరమునను మరణాంతరమునను తన ఆత్మను గుర్తింపఁగలుగుచున్నాఁడు. ఇంద్రియనష్టముచే గలుగు అనర్థములు వర్ణనాతీతములు; చమురులేని దీపమారిపోవును. నీటినుండి వెలువడిన చేప చనిపోవును. ఇసుకపునాదులపై గట్టిన భవన మిట్టె కూలిపోవును. అట్లే ఎవఁడు వానివీర్యమును వృథాచేయుచున్నాఁడో వాని ఆరోగ్యసౌభాగ్యములు, తేజశ్శక్తులు, శాంతిదాంతులు, ధైర్యస్థైర్యములు, భక్తివైరాగ్యములు,అన్నియును మంచిది—గొప్పది అని మానవజీవితములో పిలువబడు ప్రతివిషయములు—అతనిలో చల్లారిపోవును. ఇంద్రియనష్టము మరణముకంటె ఘోరమైనది. కత్తిదెబ్బచే ఆత్మహత్యగావించుకొని మనుష్యుఁడు, విచారములనుండి దౌర్భాగ్యములనుండి నిముసములో విముక్తుఁడు కావచ్చును. కాని ఇంద్రియనష్టము చేసిన మనుజుఁడు అనంతమగు బాధననుభవించుచు, శారీరక జడిమవలనను, నరదౌర్బల్యమువలనను, అసంతుష్టివలనను, నిరాశవలనను జీవితముపాడుగునను దురపిల్లుచు కొంచెము కొంచెముగా చచ్చుచునేయుండును.

ప్రస్తుతకాలమున భారతయువకులలో చాలమంది ఆత్మమారకమును ఘోరమునగు ఈదురభ్యాసమునకు పాలై శరీరక్షేమమునకై హాహాకారములను సలుపుచున్నారు. కాని అయ్యో! వారియార్తరవము ఎవ్వరిహృదయమును కరగించుటలేదు. ఒక్కసారి దీనిని తలంచుకొనినచో నెంతటి కఠినహృదయునకైనను జుగుప్సచే నతని రోమములు నిక్కవొడిచి, అతని కనులవెంబడి ధారాపాతముగా అశ్రువర్షము గురియకమానదు.

అట్లు వీర్యమును వృథాజేసితివా! నీఆరోగ్యము భగ్నమైపోవును. నీజీవితము దుఃఖములకు వ్యాధులకు ఎరయగును. నీరూపము అస్థిగతమై, అందవికారమై, అతివకృమై యుండును. కండ్లుగోతులై దిగబడిపోయి వానిసౌందర్యమును కాంతినిగోల్పోవును. కంఠస్వరము గద్గదికమై ఎలుగువాఱును. నరములు గుడ్డపీలికలై, దారములై, మెదడు దుర్బలమై మేధశ్శక్తి జర్జరితమగును. లోకములోనున్న ఆధివ్యాధులకన్నిటిని నీవేమూలస్థానమవగుదువు.

ఇంద్రియనష్టము, శారీరక, బుద్ధ్యాత్మిక, నైతికాధ్యాత్మికదుర్గతికి గొనిపోవును. కాని దానిపుష్టి శారీరకముగా బలమును, ఆరోగ్యమును, బుద్ధ్యాత్మికముగా తెలివితేటలను, నైతికముగా దార్ఢ్యము ఔన్నత్యమును, ఆధ్యాత్మికముగా

ఆత్మవిజ్ఞానము, దివ్యవిజ్ఞానమును సమకూర్చును. అంగీకరించినను సరే, లేక నిరాకరించినను సరే. ఒక్కొక్కరును వారు వారే ప్రశ్నించుకొనినచో, జాతియొక్క ఆర్థికరాజకీయదాస్యము మతసాంఘికభ్రష్టత్వము ఈనైతికదౌర్భాగ్యమువలననే కలిగినదని కనుగొందురు. జాతీయవిముక్తియు నైతికపుష్టిని సమకూర్చుటయందే ఇమిడియున్నది. భారతమానవకమా! దీనినిగూర్చి చింతింపుము. ఇంద్రియనిగ్రహమునకై వలయు శారీరక మానసికములైన విధులు విధానములును గురించి వచ్చు ప్రకరణమునందు వివరింపఁబడినది.

---

ఓమ్

# బ్రహ్మచర్యానుష్ఠానమునకు బాలురు యువకులు గమనింపవలసిన విధులు విధానములు

"ఇంద్రియనిగ్రహమే బ్రహ్మచర్యసారము."- పతంజలి.

"శారీరక, బుద్ధ్యాత్మిక, నైతికాధ్యాత్మికశక్తులు బ్రహ్మచర్యముయొక్క సంతానములే"- పతంజలి.

## శారీరకము.

1. ఇంద్రియనిగ్రహముకొఱకు, శారీరకముగా, మానసికముగా, వాచకముగా, అవ్యయమైన క్రమాదీక్షతోను అనర్గళమైన శాంతితోడను క్షాంతితోడను ప్రయత్నింపుడు. కార్యదీక్షయే ఎటువంటి ప్రయత్నమునకు ప్రాణము.

2. సామాన్యమై, మితమై, అజీర్ణముగాని ఆహారము తీసికొనుము. చేపలు, గ్రుడ్లు, మాంసము, ఉల్లిపాయలు మొదలగు వేడిచేసెడివస్తువులను తినకుము. కాని చేపలను వదలలేకున్నచో వానిని మితముగా భుజింపవలయును. ఇంద్రియములు వ్యాకులపడక స్థైర్యమును, బలమును నిలుపుకొనునట్టివాఁడు పిడికెడు బియ్యము పిడికెడు పప్పుతో రోజు గడుపవచ్చునను మాటవృథగాదు. భారతదేశమునందలి

వితంతువులే ఇందుకు నిదర్శనములు; వారు ఒంటిపూట భుజింతురు. అయినను మాంసము చేపలు తిననేతినరు.

ప్రస్తుతకాలములో విద్యార్థులకు ఉపాధ్యాయులకు పోషకులకు పిల్లలశారీరక మానసిక దౌర్బల్యము పుష్టికలుగు ఆహారము లేక పోవుటవలనని చెప్పుట ఆచారమైనది. వారును అనవసరవ్యయము పేదఱికమును తెచ్చిపెట్టుటయెఱుగరో కో! అనర్థవ్యయము చేయుట యేల; అటుపై కావలయుననుట యేల; కావున వీర్యమును అనర్థవ్యయము చేయకుడు. సామాన్యమైన ఆహారమే సరిపోవును.

పర్వదినములందు—ఏకాదశి, పూర్ణిమ, అమావాస్య లందు ఉపవాసములను చేయుడు. అంతగా అవసరమైనచో ఆదినమందు ఫలములు పాలు మొదలగు సులభముగా జీర్ణించు పదార్థములనే భుజింపవలయును.

౩. భోగవస్తువులను విసర్జింపుడు:— భోగవస్తువులనగా కేవలము జీవించుటకు అవసరమగు ఆహారమును, ధరించుటకు అవసరమగు వస్త్రమునుదప్ప మఱియే చిన్నవస్తువైనను ఈజాతిలోనికే వచ్చుచున్నది. సామాన్యముగా జీవించుట. అసామాన్యముగా భావించుట అను ఈ రెండే భారతసాంఘిక జీవనముయొక్క పరమలక్ష్యములు.

4. తమలపాకులు, వక్కలు, సిగరెట్లు, టీ, కాఫీ, పొగాకు, మొదలగు నిషాగలిగించు వస్తువులను పూర్ణముగా విడిచిపెట్టవలెను. ఈవస్తువులు చూచుటకు స్వల్పములైనను, బ్రహ్మచర్యమునకు తోకచుక్కలు.

5. మీావికానటువంటి గుడ్డలను పరుపులనుఉపయోగింపకుండు:—ఒకరిచే నుచ్ఛిష్టమైనభోజనము ఇంకొకరు తినకూడదు. ఈవిధముగనే విషక్రిములు ఒకరినుండి మరియొకరికి సంక్రమించి వారివారి ప్రవర్తనలకు దేహములకు నైతికదౌర్బల్యమును వ్యాపింపఁజేయును. పరుల వస్త్రములను గాని పడుకలనుగాని ఉపయోగించనట్లే ఒకరినిగూడ మీావాటిపై చేరనీయవద్దు.

6. ఎల్లప్పుడును నీ స్థానమునందే—నీ స్థానమునందే నిద్రింపవలయును. ఇది గట్టిగా జ్ఞాపకముంచుకోవలసిన విషయము. ఒకవేళ పడుకలు నీకు దొరకనిచో ఆరాత్రియంతయును మేలుకొనియైననుండుము; లేదా వట్టినేలనైన పండుకొనుము. ఈనియమము నెప్పుడును అతిక్రమించవద్దు. ఎల్లప్పుడు వెల్లకిలపరుండుము, ఒత్తిగిలి ఎన్నడును పండుకొనవద్దు.

7. ఐదుగంటలకాలముకంటె ఎప్పుడును నిద్రింపవద్దు. రోగిగాని ప్రతివానికిని ఆరోగ్యముగావలెనన్న 5 గంటల కాలముకన్న నిద్ర అనవసరము. రాత్రి 10 గం మొదలు తెల్ల

వారుజాము 3 గంటలవరకు నిద్రకు సమయము. రాత్రియొక్క చరమయామమును నిద్రతో గడిపివేయక ప్రార్థనతో గడిపివేయుట మంచిది. సాధారణముగా రాత్రి చరమయామమునందే ఇంద్రియనష్టము గలుగుచుండును. కావున ఇంద్రియ స్తంభనము వేకువజామున నిద్రించువానికి అసాధ్యముగు కార్యము. పగటిపూటనిద్రించుట నైతికశ్రేయమునకు హానికరమైనది.

8. కౌపీనమునుగాని లంగోటీనిగాని ధరించుట బ్రహ్మచర్యానుష్ఠానమునకు మంచిమార్గము. దివారాత్రములు దానిని ధరింపుము.

9. ఉదయము సాయంకాలము రెండుసార్లు తప్పక శరీరవ్యాయామము చేయుము. శారీరకపరిశ్రమ అనవసరమైన వారికిగూడ రోజునకొక్కసారియైన శరీరవ్యాయామముముఖ్యావసరము నియమము, నిష్ఠ ఈరెండునుతప్పక నభ్యసింపవలెను.

ఫుట్‌బాలు, బేడ్ మెంటెన్, టెన్నిస్, హాకీ, మొదలగునవి చాలా విలువగలిగినటువంటి ఆటలు.మరియు శీతవాతావరణములకు తగిన వ్యాయామములగుటచే ఉష్ణదేశములో నివసించు మన ఆరోగ్యమునకు అవి అనారోగ్యములు. కనుక బాలురు యువకులు కరేళాలు, లోడీపేర్లల్ బారు మున్నగు

సాధనములతోడను సామాన్యముగా భూమిపై కసరత్తును చేయవలయును.

<u>ప్రస్తుతకాలములో భారతదేశములోని బాలురకు, యువకులకు శరీరవ్యాయామమునకు బలకరమైన తిండియే ముఖ్యావసరమని చెప్పుట ఆచారమైనది. కాని అంతటి తెలివి తక్కువమాట ఇంకొకటి లేదు.</u>

బ్రహ్మచర్యమనుష్ఠించు మనుష్యునకు, అనగా వీర్యశక్తి తగ్గని మానవునకు, పట్టె బియ్యముపప్పుతో కూడిన యాహారమున్నను; ఆతడు శరీరపరిశ్రమ చేయుటకు ఏవిధమగు ఆటంకము లేదని స్వానుభవముచేత గట్టిగను మేము చెప్పగలము.

శరీరవ్యాయామము మన కండరములను ఇనుమువలెను, మన నరములను ఉక్కువలెను బిగువైనవిగను చేయును. శరీరముయొక్క ప్రత్యవయవము కదలుచుండుట వలన రక్తస్రావము వేగముగా జరుగును. దానివలన మన శరీరములోనికి అధికముగా ప్రాణవాయువు పీల్చుకొనబడుటచే మన రక్తము పరిశుద్ధము చేయబడును. అందుచే విషక్రిములు చచ్చిపోవును. శరీరవ్యాయామము జఠరాగ్నిని రగుల్చును. కుంభకపూరకవ్యాయామము మాలిన్యమును బయటికి త్రోసివేయును. అది శరీరమును తేలికగాను, చురుకుగాను, చేతులు కాళ్లను చక్కగాను శుభ్రముగాను చేయుటచే గాఢమగు నిద్రపట్టును. నియామకముగా వ్యాయామము చేయు బాలురుగాని, యువ

కుడుగాని అనిర్వాచ్యమైన ఒకానొక హృదయానందము ననుభవించుచు దురాలోచనలకు దుర్వ్యసనములకు దూరుఁడై చక్కని దేహములో చక్కని మనస్సువలె విలసిల్లును.

10. ఇతరులయొక్క దేహములగాని వారియంగముల కాని స్పృశింపకుము. ఇతరులను నీయంగములను తాకనీయకుము. అట్లు చేసిన ఇంద్రియ నిగ్రహమునకు చాలహానికరము. చిన్నకుఱ్ఱవాండ్రనుగాని ఆడపిల్లలనుగాని ఒడిలోకూర్చుండబెట్టుకొనకుము. వారిని లాలింపకుము.

11. స్వయముగా ఏ ఆడుదాని మొగముచుగాని, ఆడపిల్ల మొగమునుకాని, కుఱ్ఱవాని మొగమునుకాని చూడకుము. దేహసౌందర్యమువలననే మోహావేశ ముద్భవించును. అది ఎంతగట్టివాఁగుండె నెనను చలింపచేయును.

అవసరమువచ్చినప్పుడుతప్ప మాట్లాడకుము. మాట్లాడుటమానినయెడల నీవు చాలపాపములను, చాలాపాపకృత్యములను తప్పించుకొనినవాఁడవగుదువు. సంభాషణమువలననే సంగతము కలియును. కాబట్టి నీవు ఇతరుల దుస్సంగత్వమును తప్పించుకొనదలచిన ఇతరులతో అవసరమువచ్చినప్పుడుతప్ప మాట్లాడకుము. పొల్లుమాటవకటియు పెదవిని దాటనీయకుము. మితసంభాషణవలన నీవు నీమనస్సును నిగ్రహించుకొనగలిగి నిర్మలముగాను శాంతముగాను ఉంచుకొనగలవు.

12. లోభి తనధనమును ఎట్లు భద్రముగా దాచుకొనునో స్వశ్రేయము కోరుమనుష్యుడు ఇంద్రియమును, మాటలను అట్లుగా దాచుకొనవలెను.

13. నీమనస్సును శరీరమును ఎల్లప్పుడును ఏదోయొక పనియందు నిమగ్నము చేసియుంచుము. సోమరిపోతుయొక్క మనస్సు దయ్యాలరచ్చపట్టు అనుమాట జ్ఞాపకముంచుకొనుము. మనస్సు శూన్యముగా ఎన్నడునుఉండజాలదు; అది ఎల్లప్పుడును మంచివో చెడ్డవో ఏవో ఒక ఆలోచనల వెంబడి పరుగెత్తుచుండును. కావున దైనందిన కాలపత్రికను ఒక దానిని తయారుచేసికొనుము; పగటిని రాత్రిని అనేకవిభాగములుగ చేసి ప్రతివిభాగమునకును ఏదో ఒకపనినికల్పించుము.

## మా న సి క ము.

1. ఎల్లప్పుడు నీమనస్సును సదాలోచనలతోను, ఉన్నతాశయములతోను, సత్సంకల్పములతోను, సదుపదేశక గ్రంథములతోను, పరమేశ్వరనామజపముతోను, పరమేశ్వర ప్రార్థనతోడను, చింతనతోను నింపియుంచుము.

ప్రతిదినమును పరమేశ్వరనామజపమును పరమేశ్వర చింతనమును వేకువజామున ఒకసారి, సాయంకాలమునందు ఒకసారి, పరుండబోవునప్పు డొకసారి చేయుము.

2. ఏమిషచేతనైన నీహృదయములోనికి చెడుతలంపులు ప్రవేశించెనేని వెంటనే పరమేశ్వరుని స్మరించికొని ఆతనిని క్షమాపణకై ప్రార్థించుకొనుము.

3. పరుండబోవునప్పుడు అన్ని ఆలోచనముల విడిచిపెట్టి పరమేశ్వరచింతనమునందే మగ్నుండవైపొమ్ము. ఈకాలమునందు ఏచెడుతలంపు నీమనసునంజొచ్చినను ఇంద్రియస్ఖలనము తప్పదు.

4. దినదినము భగవద్గీత లేక మరియేదేని మతిగ్రంథములోని కొంతభాగమును చదువుము. కష్టపడియైనను ఒక శ్లోకమునైనను కంఠస్థముగావింపుము.

5. ప్రతిరోజును భగవన్నామజపమును, భగవచ్చింతనమునకై 2 గంటలైనను వినియోగించుము.

6. పరుండబోవునపుడు ఆరోజున చేసిన పనుల నొకసారి స్మరించుకొని విమర్శించుకొని ఒకదినచర్యపుస్తకమును పెట్టుకొని రోజునకురోజు పైకెక్కుచుంటివో దిగుచుంటివో లేక, విరుద్ధముగా నుంటివో తెలిసికొనుము.

ఓమ్.

# ఆత్మపరీక్ష.

ఆత్మవృత్తికి ఆత్మపరీక్షయే ముఖ్యావసరమైనది.

ఒకభవనము కట్టవలెనన్న ఒకఇటుకపై ఇంకొకఇటుక పెట్టి ఎట్లు నిర్మించుకొందురో అట్లే ఉన్నతమును ఉత్కృష్టమును అగు జీవితప్రవర్తనలను నిర్మించుకొనవలెనన్న కష్టపడి శ్రమలకు ఓర్చి ఉత్కృష్టములగు గుణముల నన్నిటిని ఒకదాని తరువాతనొకటి సంపాదించుకొని దుర్గుణములను దుర్లిప్సలను ఒకదాని వెనుక నొకటి తఱిమి వేయవలెను. ఆమహాప్రయత్నమునకు అనర్గళమగు శాంతియు అవితథమగు ఉత్సాహమును అత్యధికమగు ఆత్మవిశ్వాసమును ఉండవలయును.

నీహృదయములో ఒకఉన్నతలక్ష్యమును ఎల్లప్పుడును ప్రజ్వలితముగా నుంచుకొనుము. కాలప్రణాళిక నొకదానిని తయారుచేసికొని దినచర్యను ఒకదానిని ఏర్పఱుచుకొనుము. పరుండబోవునపుడు ప్రతిరోజును నిన్నునీవు విమర్శించుకొని ఎంతపైకెక్కితివో లేక ఎంత అగాధమునకు దిగితివో, ఎన్ని దురాలోచనలకు ఎన్నిదుర్లిప్సలకు పాలైతివో ఎంచిచూచుకొనుము. మరియు ఉత్సాహముతోను పరిశుద్ధచిత్తముతోను నిన్నునీవు విమర్శించుకొనుము ఈవిధముగా కాలముగడిపినయెడల నేటికన్న రేపు నీయందు తప్పక ఉత్తమగుణములు కనంబడును.

# దైనందిన కాల ప్రణాళిక.



(1) వేసవిఅయినచో తెల్లవారుజామున 3 గంటలకును శీతాకాలముఅయినచో 4 గంటలకును లెమ్ము. పెందలకడ లేచుట, ఇంద్రియనిగ్రహసాధనచేయు ప్రతి మనుష్యునకును ముఖ్యావసరము. నిద్రనుండి లేచి బయలుదేరకమునుపు కొంచెముసేపు దైవప్రార్థనచేసికొనుము.

(2) వేసవిఅయినచో $3\frac{1}{2}$, $4\frac{1}{2}$ మధ్యమునను శీతాకాలముఅయినచో $4\frac{1}{2}$ మొదలుకొని $5\frac{1}{2}$ వరకును ప్రాతఃకృత్యములను శరీరవ్యాయామమును చేసికొనుము.

(3) $4\frac{1}{2}$—$5\frac{1}{2}$ మధ్య (శీతాకాలమయినచో) $5\frac{1}{2}$ - $6\frac{1}{2}$ మధ్య ప్రత్యేకముగా ఏర్పఱుపబడిన ఒకగదిలో ఒక పీటపైగూర్చుండి పరమేశ్వరుని నామజపమును కావించి భగద్గీతలో కొంతభాగమును చదువుకొనుము.

(4) వేసవిలో $5\frac{1}{2}$ నుండి (శీతాకాలములో $6\frac{1}{2}$ నుండి) 9 లేక $9\frac{1}{2}$ వరకు విద్యార్థులు వారి విద్యాభ్యాసంగమును చేయవలెను. మిగిలినవారు వారిగృహకృత్యములచేసికొనవలెను.

(5) $9\frac{1}{2}$ నుండి $10\frac{1}{2}$ వరకు మాధ్యాహ్నికకృత్యములు చేసికొని భగవంతుని అర్చించినతర్వాత భోజనము చేయుము.

(6) 11—4 గంటలమధ్య విద్యార్థులు విద్యాభ్యాసంగమును ఇతరులు వారివారి నిత్యకృత్యములు చేసికొనవలెను.

(7) సాయంకాలము 4—$4\frac{1}{2}$ మధ్యను శీతాకాలమయినచో 5—$6\frac{1}{2}$ మధ్యను ప్రతివారును నియామకముగా శరీరవ్యాయామము చేయవలెను.

(8) సాయంకాలమున వేసవిలో $6\frac{1}{2}$ మొదలు 7 వరకును శీతాకాలమయినచో $5\frac{1}{2}$ మొదలు 6 వరకు సాయంకాలకృత్యములు తీర్చుకొని ప్రత్యేకముగా నేర్పరచిన ఒకగదిలో స్థిరాసనాసీనులై భగవంతుని స్మరించి, జపించి ప్రార్థించవలెను.

(9) వేసవిలో రాత్రి 7—10 వరకును శీతాకాలమయినచో 6—11 వరకు విద్యార్థులు విద్యావ్యాసంగము చేసికొనవలెను ఇతరులు వారివారిపనులను చేసికొనవలెను. శెలవుదినములలోకూడ ప్రతిదినమును ప్రతివారును ఈప్రణాళికను అనుసరింపవలెను. చీట్లపేక, జూదము మొదలగు వ్యసనములలో ప్రతివారును తగులుకొనకూడదు. అవకాశమున్నచో ప్రతివారును లోకసేవకును జాతీయోపకారసంస్థల సేవించుటయందును తమకాలమును వినియోగింపవలెను.

ఓం తత్సత్.

# నాయకుని యొక్క అనగా ఒక సద్గురుని యొక్క ఆవశ్యకత.



నౌకకు కర్ణధారి యెట్లో, విద్యార్థికి అధ్యాపకుఁడెట్లో, ప్రయాణికునికి కాలసూచిక యెట్లో అట్లే ఉత్కృష్టజీవితమును ఉన్నతస్వభావమును ఏర్పఱుచుకొనుపట్లఒక సద్గురుఁడు లేక ఆధ్యాత్మికోపదేశకుఁడు అనగా ఒకతత్వజ్ఞాని మనకు ఆదర్శకుఁడై యుండవలెను. ఆతఁడు లేకున్న మనప్రయత్నములు మనఅభిలాషలు ఆకాశహర్మ్యములగును. మీరు మీజీవజ్యోతిన్ని ప్రకాశవంతముగా చేసికొనదలచుకొనినయెడల జ్ఞానజ్యోతిచే వెలుగు ఒక మహనీయుని చెంతకు చేరుఁడు. జీవదాయకమగు ఆమహనీయుని తాకినంతనే మీలో నిద్రాణములైన సర్వశక్తులును, మీలో చల్లారిపోయిన ప్రాణములును తిరిగి మేల్కొనును. వందలకొలది పాపభూయిష్ఠజీవనము గలదుర్మార్గులు ఇట్టి పరమపురుషులస్పర్శచే దేవత్వము నొందగలిగిరి. నారదమహర్షితో కొన్నినిమిషములు సంభాషించినందుచే కలిగినపుణ్యమున రత్నాకరుడను పచ్చిదొంగ వాల్మీకిమహర్షిగా మార్చబడినకథను స్మరింపుఁడు. మనమే మనజీవితములలో స్వయముగా సత్సంగత్వమువలనను

పరమపురుష శుశ్రూషవలనను కలుగునటువంటి పరమాద్భుతపవిత్రానందమును అనుభవించుచున్నాము.

కనుక ప్రిప్రథమమున ఒకసద్గురుని ఆశ్రయించి అతని ఆర్యపాదములకు నీసర్వస్వము అర్పించి ఆతని ఆదర్శజీవితము వెంబడి నీజీవితసౌధమును నిర్మించుకొనుము. ఆత్మికదైహికదుఃఖానుభవములను నిగ్రహించుశక్తియు మానవజీవితమును ఆవేశించిన అసంఖ్యాకములగు శోకములను నివర్తించుకొనుశక్తియు ఈమహాపురుషులకారుణికత్వమువలననే చేకూరును. ఆసద్గురునియొక్క ఆధ్యాత్మికశక్తిచే ఆవరింపబడి మనము జీవితస్రోతములను, జీవితవికారములను జయించుటకుశక్తిగలిగి సర్వోన్నతుని తెలిసికొనుశక్తిక్రమముగా కలిగినవారమగుదుము.



# జపము.

బ్రహ్మచర్యానుష్ఠానమునకు ముఖ్యావసరములు మూడు:—

(1) పరమేశ్వరునికి హృదయమర్పించుట (2) పరమేశ్వరుని నామము పలుమారుజపించుట (3) పరమేశ్వరుని గూర్చిచింతించుట. పరమేశ్వరుని నామజపమువలన మనమనశ్శరీరములు పవిత్రీకృతములై దురాలోచనలు దుష్కృత్యసామర్థ్యములు సహజముగా హృదయమునుండి కడిగివేయబడి ఇంద్రియనిగ్రహానుష్ఠానము మనకు సులభసాధ్యమై మనము పరిశుద్ధులమగుదుము. ఆతని నామకీర్తనలో అంత పవిత్రభావము గలదు.

నిశ్చితమగు క్రమముతోను, ఖండితమగు నిర్ణయముతోడను నిర్జనస్థలములలో జపమాచరింపబడవలయును. తిరిగితిరిగి దానిని వేకువనిద్రలేచినప్పుడు ఒకసారి, సాయంకాలమప్పుడొకసారిని నిద్రింపబోవునప్పుడు పక్కమీద మరి ఒకసారిని ఒక్కొక్కసారి 1, 2, 3, 4 వేలపర్యాయములు ధారణచేయబడవలెను. పరమేశ్వరుని జపించునప్పుడు మనస్సును బుద్ధిని దగ్గఱపెట్టుకొని ఇష్టదైవమునుగూర్చిగాని సర్వేశ్వరునియొక్క ఇష్టమైన స్వరూపమునుగుఱించిగాని ప్రార్థింపవలెను.

మతగురువుచే ఒకసారి ఉపదేశమునుపొందినవాఁడు

గురువు చెప్పినవిధానముననే ఆచరింపవలయును కాని ఏగురువువద్దను ఉపదేశమును పొందనివాడు భగవంతునియొక్క ఏ నామమునైనను తన కిష్టమైనదానికి "ఓమ్" అను అక్షరమును మొదటచేర్చి జపించవలెను. జపమును నీకు తప్ప ఇతరుల చెవికి వినబడనియట్లుగా మాత్రము చేయవలెను. మనుష్యసంచారము లేక ఒంటరిగానుండు ఒకగదిగాని, ఒక చోటుగాని చూచుకొనుము. దానిని పరిశుద్ధముగాను, పవిత్రముగానుఉంచి వీలైనచో భగవంతునియొక్కయు ఋషీశ్వరుల యొక్కయు చిత్రములతో అలంకరించి సాంబ్రాణి మొదలగు ధూపములచే దానిని సురభిళముగాచేయుము. దర్భలచేగాని పట్టుతోగాని చేయబడిన ఆసనముపై కూర్చుండి దేహమును నిబ్బరముగానుంచి వెన్నెముకను గుండెను కంఠమును తలను ఒక్కటేకద్దీవలె నిట్టనిలువుగానుంచుకొని పరమేశ్వరుని నామమును శ్రద్ధతో జపింపుము. అలవాటులేని [illegible]నకు మొట్టమొదట అది కష్టముగా తోచవచ్చును. కాని కొలదిదినములలో క్రమక్రమాభ్యాసము దానిని సులభముగాను ఆనందదాయకముగాను చేయును. ఊపిరితిత్తులనిండా ఒక్కసారి గాలిని కుంభించి అది అయిపోవునంతవరకు పరమేశ్వరుని నామమును దానితో జపియించి మరలకుంభించి ఈవిధముగా అనేకసారులు జపము సలుపునపుడు హృదయమును పరిశుద్ధమైనను ఆవేశపూరితముగను పరమేశ్వరునివైపు మరల్చును.

# సంఘముయొక్క ఉపవిధులు.



1. సన్యాసులసమాజము:—ఇతర దేశములవలెగాక భారతవ్యుత్పత్తియు, భారతనాగరికతయు నగరమునందలికలుషములు, కలహములు, కల్లోలములనుండి ఆవిర్భవింపలేదు. పరాక్రమవంతులగు చక్రవర్తులక్రిందగాని ప్రతిభావంతులగు తాంత్రికుల యధీనమునగాని ఉద్భవింపలేదు. కాని అది దివ్యజ్ఞానమూర్తులగు ఋషులచేతను అరణ్యములకు వెళ్లి ఇహచింత మాని శాంతముగా తపస్సుచేసికొను ఋషులయొక్క దివ్యజ్ఞానశక్తినుండియే ఉద్భవించుచున్నది. శతాబ్దములపర్యంతమునుండి అంతులేని తేజశ్శక్తులతో విలసిల్లుచున్న ఋషులయొక్క క్రమనిర్మాణప్రయత్నములవలననే ఆధ్యాత్మికవ్యుత్పత్తియు, నాగరికతయు జాతియొక్క రక్తనాళములనుండి ప్రవహించుచున్నది. భారతదేశములోని సితంతుప్రలే ఇందులకు నిదర్శనములు.

చాలకాలమునుండి ఈదివ్యర్షులు సన్యాసులు జ్ఞానధనమునకు పేటికలైయున్నారు. వారు జ్ఞానమును సంఘములో పామరులకు పండితులకు గూడ సమముగా ప్రసాదించుకొను పని మహద్విధిగా ఎంచుకొనిరి. వేదోక్తములగు సన్యాసధర్మము లేమనగా ఆత్మజ్ఞానమును లోకసేవయును.

ఈసన్యాసులే ఆర్యావర్తమునకు నాయకులైయుండిరి. వారు ఆధ్యాత్మికాదర్శకులై మతసాంఘికసంస్కర్తలై శాసనముల నిచ్చువారై పురాణకర్తలై యుండిరి. క్లిష్టమై ప్రధానమైన ఏవిషయములోను వారియొక్క వ్యాఖ్యానము లే స్థిరముగా అంగీకరింపఁబడినవి.

స్వార్థపరులై నేటిసన్యాసులు తమయొక్క మోక్షమునకే చూచుకొనుచు సంఘసేవనువర్జించి పూర్వము తమయొక్క ధర్మములైయున్న సంఘసేవను విసర్జించుట చాలా విచారింపదగిన విషయము. ఈసన్యాసులే జాతీయదుర్గతికి భారతీయ దౌర్భాగ్యతకు కారణములు. భారతసేవాశ్రమ సంఘము ఇంటింటికి తిరిగి సంఘముయొక్క ఆదర్శగుణములగు, విశ్వైకమతమును ఆత్మప్రవృత్తిని ఆసేతుహిమాచలపర్యంతము ప్రచారముచేయుచు, సాంఘికసేవకే తమసర్వస్వమును అర్పించునటువంటి స్వార్థహీనులగు సన్యాసులను తయారుచేయుచున్నది. భారతజాతీయనిర్మాణమునకు సహాయపడు సంస్థలు దేశములో అక్కడక్కడ ప్రతిష్ఠింపబడుచు తన్మూలముగా దేశసేవ చేయబడుచున్నది. భారతదేశవిమోచనము సాధ్యమగునెడల అస్వార్థములగు ఈసంఘముయొక్క భగీరథప్రయత్నము లే దేశవిమోచనమునకు కారణము కావలయును.

2 పుణ్యక్షేత్రసంస్కారము:—పురాతన కాలమునుండి గయ, కాశీ, అయోధ్య, పూరి, బృందావనము, ద్వారక, మధుర మొదలగునవి పుణ్యక్షేత్రములని, భారతీయసాంఘిక జీవితప్రవాహములయొక్క ప్రధానములని ఎల్లరకు తెలిసిన విషయమే. ఈచోట్లనుండి విద్యుచ్ఛక్తివలె ఉద్గమించుచున్న టువంటి మత నైతికావేశము సంఘమునకును జాతికిని తేజశ్శక్తులను సమకూర్చుచున్నది. దేశముయొక్క నలుప్రక్కల నుండి వచ్చి ప్రజలు విశాలమగు మానవ జీవిత రహస్యములను గ్రహించివెడలి పోవుచుండెడివారు.

కాని కాలక్రమమున అనేకములగు కారణములచేత ఈ పుణ్యక్షేత్రములు వాని ఔన్నత్యమును ఆధ్యాత్మికప్రభావ మును కోల్పోయినవి. కనుక ఈపుణ్యక్షేత్రములకు నేఁడును వేనవేలు యాత్రికులు వచ్చుచున్నను వారితో సుర్కీటిబీజ ములను పుణ్యక్షేత్ర వైముఖ్యమును మాత్రమే కొనిపోవు చున్నారు.

కాని భారతదేశము మేల్కొనినది. ఆమెయొక్క శక్తి, శక్తులు విజృంభించి, ఆమెఆత్మ అప్పుడే కార్యరంగమున కుఱికినది. ఆమె తన పూర్వపు ఔన్నత్యమును పూర్వ పుటుత్తమాశయములను తిరిగి గ్రహించుటకు ఆయత్తమైనది. కాబట్టి ఇప్పుడు ఈపుణ్యక్షేత్రములను అక్కడనుండు అల్లరు లను దుర్నీతులనుండి శుభ్రము చేయుట అవసరమైయున్నది.

భారతసేవాశ్రమసంఘము ఈపనికి చక్కగా పూనుకొని సన్న్యాససమాజమును ఒక్కదానిని ప్రతిష్ఠించి వారికి సనాతన ధర్మమును బోధించి అక్కడక్కడ ముఖ్యమగు పుణ్యక్షేత్రములలో ధర్మసంస్థలను నెలకొల్పి ఈచోట్లలో పూర్ణమగు నైతికాధ్యాత్మికమగు వాతావరణము కల్పించుటకై అనేక విధములుగా పాటుపడుచున్నది.

(3) శక్తిసాధన కొఱకు బ్రహ్మచర్యము:—సంఘము జాతి అంతటిచేతను శక్తిసాధన కొఱకు "బ్రహ్మచర్యము" అనుష్ఠింప జేయుటకై ఆవేశపూరితములగు ఉపన్యాసములు ప్రకటనల మూలమున చిన్న, పెద్ద, ముసలివాండ్రు వేలకువేలుగా దిన దినమును ఆకర్షింపఁబడి క్రమశిక్షణచేత ఆచార్యదేవుని పాద సన్నిధిని "సాధనమార్గము"న తయారు చేయఁబడుచున్నారు. బంగాళాదేశములో, బ్రహ్మచర్యము, ఆత్మస్ఫూర్తి, అనునవి సంఘముచే ప్రచారణ చేయబడి ఆధ్యాత్మికప్రభంజనావేశము నొకదానిని బయలుదేరదీసినవి. ఈ సంఘము ఈఆధ్యాత్మికవాదము భరతవర్షము నంతటిని క్రమ్ముకొనునట్లుగా 5 యేండ్లలోపల చేయగలదని దృఢముగా విశ్వసించుచున్నది.

(4) విద్యావిషయకమగు ఉద్యమము:—నేటి విశ్వకళాలయ విద్యలకు సహాయముగా నుండునటుల ఆధ్యాత్మిక

నైతికశిక్షణ నొసగుటకు ఆర్యవ్యుత్పత్తిని విద్యావిషయక ముగా పునరుద్ధరింపవలయునని ఈ సంఘము సంకల్పించుకొ నియున్నది. ఈ ఉద్దేశముతోడనే ఈసంఘము దేశమునంతటను పెక్కుచోట్ల బ్రహ్మచర్యవిద్యాలయములు విద్యార్థినిలయ ములు ఆధ్యాత్మికవ్యుత్పత్తికై నెలకొల్పినది. పామరజను లకు ఉచితముగా విద్యనొసగుటకై ఉద్దేశించి ఈసంఘము అనేకచోట్ల అవర్ణులకు ఉచిత ప్రథమపాఠశాలలను నెల కొల్పినది.

(౫) <u>కుటీరపరిశ్రమల పునరుద్ధరించుట</u>:—లోకహి తార్థమై దేశమునందు అనేకస్థలములలో గ్రామపరిశ్రమల యొక్క పునరుద్ధరణము, పునఃప్రతిష్ఠ నొనర్చు తలంపుతో ఆయుద్యమమును కూడ పైన వేసికొనినది. జనులయొక్క ఆర్థికస్థితి సంస్కరింపబడవలెనన్నచో సాంఘికదుర్గతిని తొల గింపవలెనన్నచో కుటీరపరిశ్రమ పునర్నిర్మాణమే ముఖ్యా వసరము.

సంఘము ఈ యుద్దేశమునకు బలమొసంగుటకై నేత మగ్గములశాల నొకదానిని పేముఫాక్టరీ నొకదానిని నిర్మించి వానిని కుటీరపరిశ్రమములకై పేదలసంఘములోనికి వ్యాపిం పచేయుటకై ఎక్కువ కృషి చేయుచున్నది.

(6) లోకహితకర కార్యములు :—సర్వసంగపరిత్యాగము, లోకసేవ ఈ రెండే భారతదేశముయొక్క లక్ష్యములు. ఎప్పుడైనను భారతదేశము ఔన్నత్యమునకును వైభవమునకును రావలయునన్నచో, భారతజాతియు, భారతసంఘము ఈ రెండు ఉన్నతలక్ష్యములతో ఆవేశపూరితములు కావలయును. ఈసంఘము వానికై శాశ్వతముగ అసంఖ్యాకములగు ప్రజాసేవక సంస్థలను ఏర్పఱచి అసంఖ్యాకములగు ధర్మనిలయముల కట్టించి వానిమూలమున అవకాశము దొరికినప్పుడెల్ల భారతదేశమంతటను అనేకవిధములుగా సంఘసేవ చేయుచున్నది.

ఓంతత్సత్.






కాకినాడముద్రాక్షరశాల, కాకినాడ.

# ది భారత సేవాశ్రమ సంఘము.

వ్యవస్థాపకులు-అధ్యక్షులు.

జగద్గురు-ఆచార్య శ్రీమత్ స్వామి ప్రణవానందులవారు.

అనేకమైన బ్రాంచిలు—

1 కలకత్తా హెడ్డాఫీసు, బాలీగంజి.

2 గయా సేవాశ్రమము, గయ.

3 కాశీ తీర్థసేవాశ్రమము, కాశీ.

4 జగన్నాథ సేవాశ్రమము, జగన్నాథము. (పూరి)

5 బజత్ పూర్ సేవాశ్రమము, బజత్ పూర్.

6 మదిరపూర్ సేవాశ్రమము.

7 మదరపూర్ బ్రహ్మచర్య విద్యాలయము.

8 ఖుల్నా సేవాశ్రమము.

9 ఖుల్నా బ్రహ్మచర్య విద్యాలయము.

10 కలకత్తా విద్యార్థుల సంఘసేవా సమ్మేళని.

11 రాజసాహి విద్యార్థిగృహము.

12 ఉత్తరవంగ సేవాశ్రమము.

13 అసాసుని సేవాశ్రమము.

14 బుద్దట సేవాశ్రమము.

# భారత సేవాశ్రమ సంఘము యొక్క-

# ప్రచురణములు.



1 బ్రహ్మచర్యము, (బెంగాలి, హిందీ, తెలుగు)

2 గార్హస్థ్యము, డిటో

3 ధృవ భారతము (బెంగాలి)

4 కుంభమేళ, (బెంగాలి, హిందీ.)

5 భారతవర్ష పునర్నిర్మాణము. (ఇంగ్లీషు, తెల

6 బ్రహ్మచర్య నిబంధనలు జగద్గురువుల ఛాయా-
మతోనహా (అన్ని భాషలలోను.)

7 నవీనవిశ్వైకమతోద్దేశ్యము. జగద్గురువులవారి ఫోటో
సహా (అన్ని భాషలలోను.)

8 ప్రణవ- (బంగాలీభాషలోని మొదటితరమైన త్రయ
మాసపత్రిక.)

9 ఓమ్ శ్రీశ్రీ సద్గురు (బెంగాలీ.)

10 ఓమ్ శ్రీశ్రీ జగద్గురు (బెంగాలీ.)

11 ఓమ్ ఋతము (బెంగాలీ.)

---

Printed at the Cocanada Printing Works, Cocanada.
Published by the Author from Bharatha Sevasrama
Sangham, Baliganj Culcutta.